*Issued*— 9-5-1955




# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## SATURDAY, 15th MAY 1954

## VOLUME VII — No. 6

*CONTENTS*



PRINTED BY SREE PANDURANGA PRESS, ELURU
FOR THE SUPERINTENDENT
ANDHRA GOVERNMENT PRESS
KURNOOL

1955

PRICE, 6 *annas*

# ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Saturday, the 15th May 1954**

The House met in the T. L N Sabha Hall, University Campus, Waltair, at nine of the clock, Mr. Speaker (The Hon Sri N. Venkatramaiya) in the Chair.

## QUESTIONS AND ANSWERS

### STARRED QUESTIONS

*Inclusion of Nuzvid, Tiruvur and Nandigama Taluks for irrigation under Nandikonda Project.*

* 599 Q: Sri M. R. APPA RAO .- Will the Hon. the Deputy Chief Minister be pleased to state

(a) whether Nuzvid, Tiruvur, and Nandigama taluks of Krishna District are included under the area to be irrigated by the Nandikonda Project; and

(b) if not, reasons therefor ?

The Hon. Sri N. SANJEEVA REDDI —(a) and (b) The Nandikonda Project as now contemplated provides for irrigation of certain areas in Tiruvur and Nandigama taluks only on the left side. Nuzvid taluk is not included as the 140 miles long Left Bank Canal extends only upto the Kattaleru valley.

Sri M. R. APPARAO :— Will the Government consider the desirability of including this taluk ?

The Hon. Sri N. SANJEEVA REDDI.-The Government is convinced that part of it at least should be included. We will be very happy to include it.

Sri C. SUBBARAYUDU .— ఈ Left Bank Canal వల్ల నందిగామ తిరువూరు తాలూకాలలో కొన్ని ప్రదేశాలు సాగుఅవుత వనిన్నీ, నూజీవీడు తాలూకా చేర్చబడ లేదనిన్నీ అంటున్నారు. అట్లా అయితే యీ నందికొండ ప్రాజెక్టు కన్న ఫలిచింతల ప్రాజెక్టు కట్టితే,

ఎక్కువభూమి సాగు కావటానికి అవకాశం వుంటుందో లేదో investigate చేశారా? చేయక పోతే, investigate చేస్తారా?

The Hon. Sri N. SANJEEVA REDDI— పులిచింతల ప్రాజెక్టువల్ల హెచ్చు భూమి సాగు అవుతుందని నేను అనుకుంటున్నాను. కాని కేంద్ర ప్రభుత్వమువారి ఎస్టిమేట్ల ప్రకారము కాదని అన్నారు. అయినప్పటికి యీ Left Bank Canal ను పొడిగించటానికి వీలు అవుతుందేమో విచారిస్తాను.

Sri V. RAMA RAO — నందిగామ తిరువూరు తాలూకాలలో ఎన్ని ఎకరాల భూమి ఈ కాలువవల్ల సాగు అవుతుందో చెప్పగలరా?

The Hon. Sri N. SANJEEVA REDDI :— నందిగామ తాలూకాలో రెండు లక్షల అయిదువేల యకరాల భూమి సాగు అవుతుందని అంచనా వేయబడింది.

Sri S. NARAYANAPPA :— నందికొండ ప్రాజెక్టు ప్రథమ పంచవర్ష ప్రణాళికలో చేర్చవలెనని మంత్రిగారు సిఫార్సు చేసినట్లుగా చెప్పారు. కాని యిటీవల పత్రికలలో వెలువడిన వార్తలను బట్టి చూస్తే, హైదరాబాదు ప్రభుత్వము దీనికి సుముఖంగా లేనట్లు కనబడుతోంది. తరువాత సిద్ధేశ్వరం ప్రాజెక్టును తీసుకోటానికి అవకాశం లేనట్లు పత్రికలవల్ల తెలిసింది. ఇదంతా నిజమేనా? సిద్ధేశ్వరం ప్రాజెక్టు రావటానికి ఎందుకు అభ్యంతరము పెడుతున్నారని అడుగుతున్నాను!

The Hon. Sri N. SANJEEVA REDDI :— అలాంటి అభ్యంతరాలు ఏమీ లేవని అనుకుంటున్నాను. నందికొండ ప్రాజెక్టువచ్చినప్పుడు సిద్ధేశ్వరం ప్రాజెక్టు రావటానికి అభ్యంతరము లేదని వారి హామీ పుచ్చుకున్నాము. అవసరము వచ్చినప్పుడు వారు అడ్డు పెట్టరని ఆశిస్తున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఇప్పుడు నందికొండ ప్రాజెక్టుకు సంబంధించిన రిపోర్టునుబట్టి ఏ ఏ ప్రాంతాలలో ఎన్ని ఎకరాల భూమి సాగు అవుతుందో చెబుతారా?

The Hon. Sri N. SANJEEVA REDDI :— నా వద్ద ఆ details లేవు. కాని వున్నంతవరకు వివరాలు చెబుతాను.

Left Bank canal క్రింద హైదరాబాదు సంస్థానములో సాగు ఆయ్యే భూములేకాక కృష్ణాడెల్టాలో మొదటి పంటకు 1.5 లక్షల ఎకరాలు, రెండవ పంటకు 1.5 లక్షల ఎకరాలు, అన్ని పంటలకు 0.58 లక్షల ఎకరాలు సాగు అవుతాయి. నందిగామ, తిరువూరు తాలూకాలలో మొత్తం 2.5 లక్షల ఎకరాలకు ప్రయోజనం కలుగుతుంది.

Sri M. VENKATASUBBA REDDI — నందికొండ ప్రాజెక్టువల్ల కర్నూలు జిల్లాలోని మార్కాపూరు తాలూకాలో కంటే ఎత్తు ప్రాంతాలలో ఎన్ని ఎకరాలకు నీరు పారుదలవు తుంది ?

The Hon Sri N. SANJEEVA REDDI — నందికొండ ప్రాజెక్టునుంచి వచ్చే నీరు, ఎక్కువ ఎత్తు ప్రదేశాలకు ఎక్కించ వలసి వుంటే, అందుకు తప్పకుండా ప్రయత్నిస్తాము.

Sri M. HANUMANTHA RAO .— హైదరాబాదు ప్రభుత్వము, ఆంధ్ర ప్రభుత్వము నందికొండ ప్రాజెక్టు నిర్మాణ సందర్భములో పంపిన joint report ను Table మీద పెట్టుతారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI — అందులో రహస్యాలు ఏమీ లేవు. అచ్చు అవుతున్నది. ప్రింటు అయి రాగానే కాపీలు అందరికి అందజేస్తాను.

Sri P. PUNDARIKAKSHACHARYULU — ఈ నందికొండ ప్రాజెక్టు డాము యొక్క ఎత్తు original proposals ప్రకారమే fix చేయబడ్డదా ? లేక హెచ్చించడముకాని, తగ్గించడము కాని జరిగిందా ?

The Hon. Sri N. SANJEEVA REDDI —Original proposals ప్రకారం డాము ఎత్తు 590 అడుగులే.

Sri R. SIDDANNA GOWD — అధ్యక్షా ! నందికొండ ప్రాజెక్టు అమలుపరచడము ద్వారా భూములయొక్క విలువ పెరుగు

తుంది కాబట్టి ప్రభుత్వముయొక్క ఆదాయము హెచ్చుటానికి శిస్తు ఎక్కువ చేస్తారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— ప్రాజెక్టు కట్టిన తరువాత భూముల విలువ హెచ్చుతుంది. కాబట్టి ప్రభుత్వము ఆదాయము పెంచటానికి ఎన్ని విధాలనైనా ప్రయత్నిసుంది.

Sri T. NAGI REDDI :— నందికొండ ప్రాజెక్టు యీ పంచ వర్ష ప్రణాళికలో వస్తుందో రాదో అని అపోహలు ప్రజలలో ప్రబలంగా వుంటున్నవి. ఆ అపోహలు పోగొట్టటానికి సెంట్రల్ గవర్నమెంటు యిచ్చిన రిపోర్టు త్వరగా ప్రకటించుతారా ? ప్రకటించటానికి వీలు లేనంత పెద్దదిగా వుంటే, కనీసము దాని సినాప్సిస్ అయినా ప్రకటిస్తారా?

The Hon. Sri N. SANJEEVA REDDI :—కాపీలు అచ్చువేయించాలని చెప్పాను. ప్రింటు చేయించి కాపీలు పంచిపెట్టాలనే నా వుద్దేశ్యము కూడా. అది చాలా పెద్ద గ్రంథము. చులకనగా చదవటానికి వీలు అయినది కాదు. నేనుగూడా అంతా చదువలేదు. సినాప్సిస్ చదివాను. వీలు అయినంత త్వరగా దాని కాపీలు అందజేస్తాను.

Sri D. DASARADHARAMAIAH :—కుడిప్రక్క కాలువ క్రింద గుంటూరు, నెల్లూరు జిల్లాలలో భూములు సాగు అవుతవని అన్నారు. నెల్లూరు జిల్లాలో మాత్రం ఎన్ని ఎకరాలు సాగు అవుతుందో చెప్పగలరా ?

The Hon Sri N. SANJEEVA REDDI :— ఈ స్కీము ప్రకారం అంతా ఒకే సంవత్సరములో డాము కట్టడానికి ప్రయత్నము చేస్తున్నారు. నెల్లూరుకు ప్రత్యేకంగా figures నావద్ద లేవు. రెండు జిల్లాలకు కలిపి వేసిన figures నావద్ద వున్నవి. కావలెనంటే, మరొక ప్రశ్న వేస్తే, వారికి కావలసిన figures అన్నియు తెప్పించి చెబుతాను,

Sri PRAGADA KOTAIAH —ఈ నందికొండ ప్రాజెక్టుకు సంబంధించి అనేక సందర్భాలలో అనేక ప్రశ్నలు వస్తున్నాయి. అందులో ముఖ్య అంశములు తెలుసుకొనడానికి చాలా ఆటంకాలు కల్గుతున్నవి. అందుచేత పూర్తి వివరాలతో అందరూ అర్థము చేసుకొనే టట్లుగా ఒక నివేదికను ప్రకటిస్తే బాగుంటుందేమో. ఆ విధంగా ప్రభుత్వము ఒక నివేదికను ప్రకటిస్తుందా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— ఈ విషయములో యిప్పటికే ప్రతిపక్ష నాయకులు ప్రశ్నలు అడిగారు. పూర్తి వివరాలతో వీలైనంత త్వరలో ఒక నివేదికను అచ్చు వేయిస్తున్నాము. అటుపిమ్మట వీలైనంత త్వరలో దానిని ప్రకటిస్తాము.

Sri G YELLAMANDA REDDI—అధ్యక్షా ! ఈ నందికొండ ప్రాజెక్టు విషయంలో ఖోస్లా కమిటీవారు చేసిన investigation లోనూ, యిప్పుడు ప్రభుత్వము చేసిన investigation లోనూ చాలా తేడాలు వున్నట్లు కనబడుచున్నది. ఈ విషయము యిదివరలో Deputy Chief Minister, Chief Engineer గార్ల దృష్టికి తీసుకు వచ్చాము. వారు దీనిని finalise చేసేటప్పుడు పరిశీలిస్తామని చెప్పారు. ఇక్కడ House లో statement యిచ్చే సందర్భములో యిటువంటి లెక్కలు యిస్తున్నారు. అందువల్ల కుడికాలువ విషయంలో సంపూర్ణముగా investigation సాగించి అది యెంతవరకు సాధ్యమవుతుందో అంతవరకు పని చేయిస్తామని Deputy Chief Minister గారు హామీ యిస్తారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI— కాలువ త్రవ్వటం మొదలు పెట్టిన తరువాత మార్పులు వస్తాయి. మనము అనుకొన్న ప్రకారం work ప్రారంభమయిన తరువాత కాలువ level హెచ్చు చేయవచ్చు, తగ్గించవచ్చు. అందుచేత, తరవాత మార్పులు జరుగవచ్చు. ఇవి rough estimates మాత్రమే. నీరు తగ్గిపోయినప్పుడు ఆ estimates లో కొన్ని మార్పులు చేయవచ్చు. నిదానంగా మనం

నోటీసుపట్టి వుంటే నీరు యొక్కడెక్కడికి తీసుకు పోవాలన్నా అక్కడకు తీసుకుపోవచ్చు.

*Communist Presidents of Panchayat Boards.*

* 472Q—Sri M. HANUMANTHA RAO —Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state whether the Government issued any instructions for the collection of information in regard to the number of communist preisdents of Panchayat Boards that were elected recently ?

The Hon. Sri P. THIMMA REDDI :—

The answer is in the negative.

ఈ క్రొత్తగా జరిగిన పంచాయితీ యెన్నికల్లో కమ్యూనిష్టు పార్టీ వారు యెంతమంది పంచాయితీబోర్డు ప్రెసిడెంట్లుగా యెన్నిక అయ్యారని ప్రభుత్వము అడగలేదు.

Sri K. KRISHNA RAO అయ్యా, పోలీసువారు ప్రతి పంచాయితీలకు పోయి యెవరెవరిని యెన్నుకొన్నారనే విషయ సేకరణ చేయవలసినదని District Superintendent of Police కొంతమందికి circulars యిచ్చారు. ఆ విషయంలో మంత్రిగారు సమాధానం చెబుతారా ?

The Hon. Sri P. THIMMA REDDI :— అది నాకు తెలియని విషయం.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఒక మంత్రిగారికి సంబంధించిన ప్రశ్న యింకొక మంత్రిగారి పేరుతో వున్నప్పటికీ దానికి సంబంధించిన మంత్రిగారే ఆ ప్రశ్నకు జవాబు చెప్పాలి. అందుచేత ఆ మంత్రిగారే జవాబు చెప్తారా ?

The Hon. Sri P. THIMMA REDDI :— అది నా portfolio కు సంబంధించిన పంచాయితీలకు చెందిన విషయం. నేను Home Department వారిని అడగలేదు. Local Boards Department వారు Home Department ను అడగనూ లేదు. Home Department వారు Police వారిని

investigate చేయమని instruct చేశారేమో కాని, Local Boards కు సంబంధించినంతవరకు అటువంటి information యేమీ రాలేదు.

Mr. SPEAKER — ఇట్లా supplementary qustions వేస్తే, సమాధానాలు చెప్పడం సాధ్యపడదు.

Sri PILLALAMARRI VENKATESWARLU — Local Administration Department అడగకపోయినప్పటికీ, Home Department యిలాంటి వృత్తక్వలు పంపించిందా ?

The Hon. Sri P. THIMMA REDDI — Local Boards Department, Home Department కు సలహాలు ఏమీ యివ్వలేదు,

Sri PRAGADA KOTAIAH :— ప్రత్యేకంగా Communist Party సభ్యులు యెవరు అని కాకపోయినా, యే యే పార్టీలకు సంబంధించినవారు యెన్నిక అయినారనే లెక్కలు సేకరించినారా ?

The Hon. Sri. P THIMMA REDDI — మామూలుగా పరిపాలనా నిర్వహణ చూడవలసినది ప్రభుత్వమే కాబట్టి, యెక్కడెక్కడ యే యే పార్టీలకు సంబంధించినవారు వున్నారనే విషయం తెలుసుకొనటంలో తప్పులేదనుకుంటాను.

Sri B. KRISHNAMURTHY RAO — నెల్లూరు జిల్లాలో కోవూరు తాలూకాలో దంపూరు రైతు సంఘాధ్యక్షుడు ప్రభుత్వం డబ్బు తిన్నట్లు ప్రభుత్వానికి వివరాలు వచ్చాయి. నాకు అనేకచోట్ల నుండి వుత్తరాలు వస్తున్నవి. దానిమీద ప్రభుత్వం చర్యతీసుకుంటారా?

The Hon. Sri P. THIMMA REDDI :— దానికి ప్రత్యేకమైన ప్రశ్న వేస్తే చెబుతాను.

Sri K. RAJAGOPALA RAO:—ఎంతమంది కమ్యూనిష్టులు presidents గా యెన్నికైనారో అనే లెక్కలు తీసుకోక పోయినప్పటికీ పరిపాలనలో కమ్యూనిష్టులు presidents గా వున్న boards లో

ప్రభుత్వము discrimination చూపిస్తున్నట్లు కనబడుచున్నది. అదివా సవమేనా ?

The Hon. Sri P THIMMA REDDI :— ప్రభుత్వము discrimination చూపిస్తున్నట్లుగా వుంటే, యిదివరకు శ్రీ కృష్ణమూర్తిరావుగారు వేసిన ప్రశ్నకు కొంత అదనంగా జవాబు చెప్పవలసి వుంటుంది. ఎక్కడ తప్పులు వుంటే అక్కడ పరిపాలన సరిచేయవలసి వస్తుంది. అది తప్ప వేరేమీ లేదు.

*Wages for Scavengers in the State*

* 492 Q-Sri P. VENKATASUBBAYYA -Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state

(a) the scales of pay given in the Municipalities for scavengers in the State; and

(b) whether there is any proposal with the Government to prescribe uniform rates of pay in all the Municipalities ?

The Hon. Sri P. THIMMA REDDI —

(a) There are no scales of pay fixed for the scavengers etc., who are generally designated as Sanitary workers and that the workers are paid wages at market rates. A* statement showing rates of wages at which they are paid in various municipalities, is placed on the Table of the House.

(b) The answer is in the negative.

దీనికి సంబంధించిన జవాబు అచ్చువేయించి Table మీద పెట్టడమైనది.

Sri T. NAGI REDDI :— ఇప్పుడు సభ్యులందరూ జవాబుకొరకు కాగితాలు త్రిప్పుకొంటున్నారు. దానిని పూర్తిగా చదువుటకు చాల time పడుతుంది. చివరకు యీ ప్రశ్న పెడితే మంచిది. లేదా

* Vide Appendix I at page 528 infra.

యీ answer ఒక పెద్ద printed list కాబట్టి, దానిని చర్చించుటకు రేపు తీసుకుంటే మంచిది.

The Hon. Sri P. THIMMA REDDI —అధ్యక్షా ! ఇప్పుడే తీసుకుంటే మంచిది. అందుకు నాకు అభ్యంతరము యేమీలేదు.

Mr. SPEAKER —15 ప్రశ్నలు మిగిలిపోయాయి. If we go at this speed, we cannot complete the questions during the question hour.

Sri M. HANUMANTHA RAO — శ్రీ వెంకట సుబ్బయ్య గారు వేసిన ప్రశ్నలోని రెండవ భాగానికి సమాధానం యివ్వలేదు. వారికి ఒకే పద్ధతిలో జీతాలు యివ్వడానికి ప్రభుత్వం ప్రయత్నంచేస్తారా ?

The Hon. Sri P. THIMMA REDDI — ప్రశ్నలోని రెండవ భాగానికి సంబంధించినంత వరకు అలాంటి proposal ప్రభుత్వానికి లేదు. వారికిచ్చే జీతాలు, అల వెన్సులలో తేడాలు వున్నవి. ఈ తేడాలు ఆ యా municipalities కు సంబంధించిన విషయము. ఇంతజీతము, యింత dearness allowance, యింత house rent allowance యివ్వాలనే నిర్ణయం యేమీలేదు. ఆ యా municipalities అక్కడ వుండే స్థానిక పరిస్థితులనుబట్టి యేర్పాటుచేసిన జీతాలు యివి.

Sri P. VENKATASUBBAYYA :— కడప మ్యునిసిపాలిటీ లో ఒక్కొక్క వాకీ పనివానికి రు. 4/= లు చొప్పున యివ్వాలని తీర్మానం చేశారు. ఆ తీర్మానమును ప్రభుత్వము మొంబుకు సమ్మతించ లేదు. వారికిచ్చే జీతములు చాలా తక్కువగా వున్నాయి కాబట్టి, ప్రభుత్వము ఆ తీర్మానమును సమ్మతించి, జీతాలు యిప్పిస్తుందా ?

The Hon. Sri P. THIMMA REDDI:- Municipalities యెక్కువ జీతాలు యిస్తామంటే ప్రభుత్వము object చేయదు. ఎక్కువ జీతాలు యివ్వడానికి వీలుంటుందా లేదా అని అడిగి ప్రభుత్వము సలహాలు యిస్తుంది.

Sri G. SIVASANKARA REDDI — Hindupur Municipality లో scavengers కు house rent allowance యివ్వడంలేదని చెప్పబడింది. అలాంటి allowance యిచ్చేటట్లు చూడడానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా ?

The Hon. Sri P. THIMMA REDDI:— House rent allowance యిచ్చేవి Municipalities గాని, ప్రభుత్వము కాదు. Municipalities యిస్తామంటే ప్రభుత్వానికి యెట్టి అభ్యంతరమూ లేదు. ఆబరువును మ్యునిసిపాలిటీలే భరిస్తున్నవి. వారు యిచ్చేటట్లు వుంటే, దానికి ప్రభుత్వము యేమి అభ్యంతరం చెబుతుంది ?

Sri M. VEERABHADRAM :— కనీసవేతనాల చట్టం జీతాలు యెంతెంత యివ్వాలనేది స్పష్టం చేస్తున్నది. దాని ప్రకారము Advisory Committee వేసి, జీతాలు నిర్ణయించవలసి వుంది. మద్రాసు స్టేటులో వున్నప్పుడు, అప్పటి Advisory Committee రు 40/—లు కనీసవేతనంగా నిర్ణయించి వున్నప్పుడు, యిప్పుడు వారికి రు. 25/— మాత్రమే యిస్తున్నారు. అందుచేత, దానిని revise చేయడానికి ప్రభుత్వం పూనుకొంటుందా ?

The Hon. Sri P. THIMMA REDDI :— అటువంటి proposals యిప్పుడు ప్రభుత్వం దగ్గర లేవు.

Sri K. V. S. PADMANABHA RAJU— అధ్యక్షా ! విజయనగరం మునిసిపాలిటీ స్కావెంజర్సుకు హౌస్ రెంట్ అలవెన్స్ ఇవ్వవలసిందని తీర్మానం చేసింది. దాన్నిగురించి ఏమైనా ఆలోచించారా ?

The Hon. Sri P. THIMMA REDDI:—వాళ్ళు అలా చేసినట్లు నాకు తెలియదు. వాళ్లు అలా చేస్తే మరోసారి మీకు తెలియజేస్తాను.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— తెనాలిలోని స్కావెంజర్సుకు ఏమీ జీతాలే ఇవ్వడం లేదా ?

The Hon. Sri P. THIMMA REDDI:— బహుశా ఆ లెక్కలు రావడం ఆలస్యం అయిఉంటుంది. అందుచేత ఇందులో చేర్చలేదు.

Sri PRAGADA KOTAIAH — ఒకే గ్రేడుకు సంబంధించిన మునిసిపాలిటీల ఆదాయం వేరువేరుగా ఉన్నా, అక్కడ పని చేస్తున్న కమీషనర్ల జీతాలు ఒకే విధంగా ఉన్నప్పుడు అందులో ఉన్న చిన్న ఉద్యోగస్తు లందరిజీతాలూకూడా అన్నిచోట్ల సమానంగా ఉండేట్లు ప్రభుత్వం ఎందుకు నిర్ణయించ కూడదు ?

The Hon. Sri P. THIMMA REDDI — ఆయా మునిసిపాలిటీల ఆదాయాన్ని బట్టి అక్కడ ఇచ్చే జీతాలు ఉంటాయి. ఏ మునిసిపాలిటీలో ఉండే staff యొక్క జీతాలు ఆ మునిసిపాలిటీయే నిర్ణయిస్తుంది.

Sri T. POTHA RAJU — ఈ మధ్య అనేక మునిసిపాలిటీలలో కార్మికులు వారి కనీస కోర్కెల కొరకు సమ్మెలు చేశారు. రాష్ట్ర మునిసిపల్ సంఘం తరఫున ఏదైనా ఒక మెమోరాండం ప్రభుత్వానికి వచ్చిందా ? వస్తే basic wages, house rent allowance లలాంటి ప్రధాన విషయాలలో ఏమి కోరారో తెలియ జేస్తారా ?

The Hon. Sri P THIMMA REDDI — చాలా మునిసిపాలిటీలలో సమ్మెలు చేయించినమాట నిజమే. (నవ్వు). అది ప్రభుత్వం చేయించిందీ అపోజిషన్ చేయించిందీ మీకే తెలుసు. వాళ్ళకు ఎంతవరకు సహాయపడడానికి వీలుంటుందో ఆలోచించి వాళ్ళకు అంతవరకు సహాయపడమని మునిసిపాలిటీలకుచెపుతాము.

Sri G. LATCHANNA — మునిసిపాలిటీల యొక్క ఆదాయాన్నిబట్టి గ్రేడ్ నిర్ణయింప బడుతుంది అని తెలుస్తున్నది. కాబట్టి A క్లాసు మునిసిపాలిటీలో ఉండేవాళ్ళకు ఏవిధంగా ఉండాలో B క్లాసు మునిసిపాలిటీలో ఉండేవాళ్ళకు ఏవిధంగా ఉండాలో గ్రేడ్ నిర్ణయించి ఉంటే ఈ తగాయిదా తీరిపోతుంది. అలా చేయడానికి ప్రయత్నిస్తారా?

The Hon. Sri P. THIMMA REDDI :— ప్రశ్న బ్రహ్మాండంగా ఉంది. చైర్మన్‌గా ఉన్న శ్రీ C. V. K. Rao కి ఆ విషయాలు బాగా తెలుసు. స్థానికంగా అక్కడ ఉండేటటువంటి స్థాలినిబట్టి వాళ్ళకు ఇచ్చే జీతాలు నిర్ణయిస్తారు.

Sri C. V K. RAO — Point of order Sir, ఎన్నిసార్లు చెయ్యి ఎత్తినా, మీరు నాకు అవకాశం ఇవ్వలేదు. చిట్టచివరకు మంత్రిగారు తప్పుకు interpretation ఇవ్వడానికి అవకాశం ఇచ్చారు.

Mr. SPEAKER —ఇందులో point of order ఏమివుంది.

Sri C. V. K. RAO — నేను ప్రశ్న వేయకుండానే మంత్రిగారు సమాధానం చెప్పడానికి మీరు అవకాశం ఇచ్చారు, అందుచేత నాకు అవకాశం ఇమ్మని కోరుతున్నాను.

Mr. SPEAKER — Please take your scat ఇంకొక ప్రశ్నలో అవకాశం తీసుకుందురుగాని లెండి.

Sri C. V. K. RAO — I want to take a chance now.

Mr. SPEAKER — Please take your seat.

Sri. C. V. K. RAO — Alright.

Mr. SPEAKER —There should be no Speaker in the Chair. (Laughter.)

Sri C. V. K. RAO —(Rose to speak )

Mr. SPEAKER —Every member wants to speak

Sri C. V. K RAO —I want to make a personal explanation.

Mr. SPEAKER —Please take your seat. I will give you another opportunity to speak.

Starred Questions postponed from the list for 14—5—1954.

*Dachepalli Police Station*

*509 Q. Sri K. SUBBA REDDI —Will the Hon. the Deputy Chief Minister be pleased to state:

(a) the mumber of thefts taken place in the jurisdiction of the Dachepalli police station, since the arrival of the present Sub-Inspector of Police;

(b) how many of them have been detected; and

(c) how many have complained against the Sub-

Inspector, and whether the Government have inquired into the matter?

The Hon. Sri N SANJEEVA REDDI :—

(a) Two thefts occurred in the jurisdication of Dachepalli police station upto 26—2—1954 from the date the present Sub-Inspector of Police has been posted to that Station.

(b) One case has been detected.

(c) The answer is in the negative.

Sri K. SUBBA REEDI :— అధ్యక్షా, ఈ Sub-Inspector మీాద వందలకొద్దీ కేసులు వచ్చాయి. నాకు స్వయంగా తెలిసిన కేసుల్లోనే, సొత్తు ఫలానా చోట ఉందని చెప్పినా ఈ సబ్ ఇన్‌స్పెక్టరు జోక్యం కల్పించుకోలేదు. కాపురసారా మొదలైన వాటిని గురించి కూడా నేను వ్రాయడం జరిగింది. కనుక ప్రభుత్వం అతని మీాద ఇచ్చిన charges ను విచారించి చర్య తీసుకుంటారా ? అని అడుగుతున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI — ఈ ప్రశ్న వేయడంలోనే పొరపాటు ఉంది. ఇది పాత Sub - Inspector ఉన్నప్పుడు జరిగినది. ఇప్పుడు కొత్త Sub - Inspector వచ్చాడు. పాత Sub - Inspector చేసిన తప్పు. పాపం ! ఇప్పుడు కొత్తగా వచ్చిన మంచి Sub - Inspector మీాద పడింది. దాని మీాద విచారణచేసి I. G. కి కూడా తెలిపి అతన్ని మార్చి కొత్తవాడిని వేశాము.

*Gruel Centres run with the aid of Russian gift grain.*

*510 Q.—Sri G. YELLAMANDA REDDI — Will the Hon. the Minister for Land Revenue be pleased to state·

(a) as to how many gruel centres were run with the aid of Russian gift grain ;

(b) how much Russian wheat and rice was distributed in the shape of grain in the famine stricken taluks of the Nellore District; and

(c) whether the Government will furnish with village-war account?

The Hon. Sri K. KOTI REDDI —

A statement[a] containing the particulars required is placed on the Table of the House.

*Cholera Epidemic in Krishna District.*

*511 Q—Sri G. RAMA RAO:—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state:

(a) the number of attacks and deaths due to cholera in the months of October and November, 1953 in the Taluks of Krishna District, taluk-war and the reasons thereof; and

(b) whether any special staff was appointed to deal with the prevention of the epidemic and number of persons inoculated so far?

The Hon. Sri D. SANJIVAYYA.—

(a) A statement[b] showing the number of attacks and deaths from cholera during the months of October and November 1953, talukwar, in Krishna District is placed on the table of the House. The incidence and spread of cholera in these two months is predominently due to the immigration of labour population from the dry areas into the deltaic areas of the District for paddy transplantation work and their living under insanitary environment in their temporary camps, drinking contaminated and polluted channel water.

(b) Yes. During the months of October and November 1953, 27,333 persons were inoculated. From outbreak of cholera incidence in the district since July, 1953, 1,30,564 persons have been inoculated.

---

[a] Vide Appendix II at page 530 infra.

[b] Vide Appendix III at page 535 infra.

15th May 1954]

Sri G RAMA RAO — అధ్యక్షా ! ఈ statement ప్రకారం చూస్తే, అసలు ప్రభుత్వోద్యోగులు వాళ్ళయొక్క irresponsibility ని దాచిపెట్టి దొంగ report లు ఇస్తున్నట్లు తెలుస్తున్నది. అక్టోబరు నెలలో దివి తాలూకాలో 22 attacks, 16 deaths అని వ్రాసి ఉంది. ఒక్క నిడుబ్రోలులోనే 26 మంది ఒక్క రోజున చచ్చిపోయారు. దివి తాలూకాలో నవంబరు నెల్లో 5 attacks, 4 deaths అని వ్రాసి వుంది. ఇది అంతా ప్రభుత్వోద్యోగులు వాళ్ళయొక్క irresponsibility ని దాచిపెట్టడానికి చేస్తున్నపని. October, November నెల్లో వరుసగా కూలీలు రావడంవల్ల వాళ్ళకు కావలసిన సదుపాయాలు కల్పిస్తారా ? లేదా ? అని అడుగుతున్నాను.

The Hon. Sri D. SANJIVAYYA :— Attacks four, deaths five అన్నది, printer's devil. 5 attacks, 4 deaths అని వుండవలసింది, ఈ విధంగా పడింది. మా దగ్గరున్న file లో రైటుగానే వున్నది. ఆ file మాకు Director of Public Health నుంచి వచ్చింది. ఇది clerk's mistake కాదు. దీనిని గురించి మీరింతగా చెప్పడం భావ్యం కాదు.

మా దగ్గరున్న statement లో కంటే ఇంకా ఎక్కువ attacks, deaths వున్నాయని చెప్తున్నారు. ఇది కనుక మీరు specific గా ఋజువు చేసినట్లైతే, మా లెక్కలు తప్పో, మీ లెక్కలు తప్పో అనే విషయము enquire చేసి తెలుసుకోవచ్చును.

Sri M. R. APPA RAO:—Since the exodus of labour from the dry areas takes place in June, cannot steps be taken to vaccinate or inoculate them long before that date?

The Hon. Sri D. SANJIVAYYA :—In fact we have been asking the village officials to suggest as to how many have been moving from the dry to the deltaic areas, so that the Health Department at the district level could take all possible steps to prevent these epidemics.

[15th May 1954

Sri G. ANJANEYULU — అధ్యక్షా! ఇప్పుడు మంత్రి గారు సమాధానం చెప్తూ specific గా నా దృష్టికి తీసుకు వస్తే నేను enquire చేస్తానని చెప్పారు. Public Health Demand పై గత బడ్జెట్ సమావేశంలో చర్చ జరుగు తున్నప్పుడు, నేను ప్రసంగిస్తూ మంత్రిగారి దృష్టికి అనేక విషయాలను తీసుకు వచ్చాను. కాని మంత్రిగారు వాటిపై ఇంతవరకు ఏమీ చర్యలు తీసుకోలేదు. Enquiry కూడా చేయలేదు. కృష్ణాజిల్లా Health Officer, బందరు తాలూకాలో కలరా attack అయి serious గా ఉన్నపుడు రమ్మని అడిగితే గ్రామ మునసబు దగ్గరనుంచి report వస్తేనే కాని మేము అక్కడికి రావాలని రూలు ప్రకారంలేదు అని నా దగ్గర చెప్పాడు. అందువల్ల బందరు తాలూకాలో పల్లెతుమ్మలపాలెం అనే గ్రామములో కలరా వచ్చినప్పుడు 30 మంది చనిపోయినా, అనేకమంది రిపోర్టు చేసినా కదలలేదు. ఈ విషయం పత్రికలలో కూడా పడింది. ఈ ఆలస్యం కారణంగా పాతిపెట్టే దిక్కు కూడా లేక, గ్రద్దలు, రాబందులు, కుక్కలు పీక్కుతింటూ పడివున్న అస్థిపంజరాల photo లు కూడా పత్రికలలో పడ్డాయి. బందరు తాలుకాలో మంత్రిగారు పర్యటనకు వచ్చినపుడు బందరులో ఆ విషయమై మంత్రిగారిని enquiry చేయమని మెమోరాండం యిచ్చాము. కాబట్టి మంత్రిగారు స్పెసిఫిక్ గా ఆయన ముందు పెట్టమన్నారు కాబట్టి పెట్టిన దాన్ని గురించి యిప్పటికైనా యెంక్వయిరీ చేస్తారా? అని అడుగు చున్నాను.

The Hon. Sri D. SANJIVAYYA — Enquiry తప్పకుండా చేస్తామని ఇందాక చెప్పాను నేను. పత్రికలలో ఆ photo లు, ఆ వార్తలు పడ్డాయంటున్నారు. అవి ఏ పత్రికలో పడ్డాయండీ పత్రికలు అంటే సాధారణంగా వార్తా పత్రికలే అనుకుంటాను. ఏ పత్రికో చెప్తే అది చూచి దానిని బట్టి enquiry చేస్తాము.

Sri G. ANJANEYULU :— విశాలాంధ్ర పేపర్లోనండీ.

The Hon. Sri D. SANJIVAYYA :— ఆ? విశాలాంధ్రలో పడతాయి యిటు వంటివి అన్నీ!

Sri T. NAGI REDDI :— ఈ కలరా వ్యాధివల్ల చనిపోయి పాతిపెట్టడానికి, ఏమిచేయడానికి వీలులేని అవస్థలోఉన్న శవాల ఫొటోలు విశాలాంధ్ర పేపర్లో వేశారు.

Sri K. RAJAGOPALA RAO — Harvest times లో పనిచేయడానికి వచ్చేవారికి, అచ్చటి ప్రజలకు టీకాలు వేయలేక పోతున్నారంటే వారికి సరిగా మందులు లేకనూ, మందులను సప్లై చేయడానికి కావలసిన జీపులులేకనూ, ఇంకా ఇతర సౌకర్యములు లేకపోవటమే కారణం. అందువల్ల ఆ సౌకర్యములను వారికి కలుగజేయడానికి వెంటనే చర్యలు తీసుకొంటారా ? Medical ఉద్యోగస్థులకు అస లేమీ సౌకర్యములు లేవు ఈవిషయాలు పేపర్లో పడితే ఆ పేపర్లవారిది తప్పు, అబద్ధం అంటున్నారు

The Hon. Sri D. SANJIVAYYA — పత్రికలలో వేయటం తప్పు అని కాదు. అది నిజమో అబద్ధమో తెలుసుకొని అది నిజమైనట్లైతే, అచ్చట వారికి కావలసిన సౌకర్యాలు కల్పించి మందులు సప్లైచేయడానికి ఏర్పాటు చేస్తాము కాని జీపులులేవని చెప్పడం అబద్ధం. అక్కడ జీపులు వున్నాయి, అవి సరిపోతాయి. ఇంతే కాక specific staff ను కూడా ఏర్పాటు చేస్తున్నాము.

Sri G. SURYANARAYANA :— వారు చనిపోయిన విశేషాలు ఒక విశాలాంధ్ర పత్రికలోనే వున్నాయా ? ఇంకా, ఏవైనాపత్రికలలో ఉన్నాయా ?

(No Answer)

Q —512 Sri S. NARAYANAPPA :— I have got the proper answer yesterday. That is why I am not putting my question.

Mr. SPEAKER — The question is not put by the Hon. Member. It need not be answered.

Sri PILLALAMARRI VENKATESWARLU — Point of order, Sir. ఒక ప్రశ్న ఇక్కడ వేసి, దానిని withdraw చేసుకుంటున్నాను అని ముందుగా నోటీసు యిచ్చి withdraw చేయదలచుకొన్నప్పుడు దానిని withdraw చేసుకుంటే బాగుంటుంది, ఇప్పుడు ఇది House ముందు ఉంది, ముందు నోటీసు

యున్నారు, nick of the moment లో వచ్చి దీనిని withdraw చేసుకొంటున్నానని అంటున్నారు. ఇప్పుడిది House ముందర ఉన్నది. కనుక Only by the leave of the House withdraw చేసుకోవాలి. అంతేకాని ఈవిధంగా nick of the moment లో withdraw చేసుకోవడానికి వీలులేదు. మేం ఎవ్వరం ఈ విషయమై question వేయలేదు.

Mr. SPEAKER:— He does not press it. ఇప్పుడేంచేస్తారు?

Sri PILLALAMARRI VENKATESWARLU — మీరు ఏమి చేయమంటే అది చేస్తాము.

Mr. SPEAKRER.— ఇంకొక ప్రశ్న పంపండి.

*Lease of forest areas for cultivation to the landless poor.*

*513 Q.— Sri PRAGADA KOTAIAH — Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state

(a) Whether it is a fact, as appeared in the press, that he has stated that certain areas in forests lying as deserts would be given on lease for long periods for cultivation to the landless poor, and

(b) if so, whether specific instructions in the matter have been issued to the officers cencerned?

The Hon. Sri P. THIMMA REDDI —

(a) Yes.

(b) The matter is under consideration. Instructions will be issued after a decision is taken.

The Hon. Sri P. THIMMA REDDI:-గౌరవనీయసభ్యులు ప్రశ్నించిన ప్రకారంగా Reserve forest లో forest కు పనికి రాకుండా ఖాళీగా ఉన్న కొన్ని ప్రదేశాలను, వ్యవసాయానికి lease కి యివ్వమనే ఉద్దేశ్యం ప్రభుత్వానికి వున్నది. కాని forest లు లేనిచోట, ఆయా areas ను బట్టి వాటిని ఏ ఏ విధంగా ఏ ఏ రేటుకు యివ్వాలి అనే విషయములను గురించి ఆలోచించి ఏదో నిర్ణయం చేయబడుతోంది.

Sri N. VENKATAYYA — గడ్డి, కంప, చెట్లు, చేమలు మొదలైనవి చుట్టూ ఉన్నప్పుడు అక్కడ వ్యవసాయం చేస్తే అక్కడ పంటలు పండుతాయండీ ?

The Hon. Sri P. THIMMA REDDI — అయినా సాగు చేసి, దుక్కిదున్ని ఎరువులు వేస్తే ఏదో పంట పండుతుంది.

Sri N. VENKATAYYA — Forest లో అటువంటి ఖాళీలు ఉండటానికి కారణం ఏమిటండీ ? అక్కడ చెట్లు, చేమలు మొలవకా లేక అక్కడుండే చెట్లు కొట్టివేస్తే ఏర్పడిందా ?

The Hon. Sri P. THIMMA REDDI :— రెండు విధాలా ఏర్పడుతుంది.

Sri PRAGADA KOTAIAH — అధ్యక్షా ! ఇలాంటి భూములను వ్యవసాయానికి lease కి యివ్వడానికి ప్రభుత్వం ఇంకా ఆలోచిస్తున్నదా ? ఉత్తర్వులు జారీచేస్తుందా ?

The Hon. Sri P. THIMMA REDDI :— ఉత్తర్వులు జారీ చేశాము.

Sri L. LAKSHMANA DAS.— అధ్యక్షా! ఈ forest లను కొండజాతులవారికి కేటాయించడానికి ప్రభుత్వం ప్రయత్నంచేస్తుందా ?

The Hon. Sri P. THIMMA REDDI — ఈ కొండజాతులవారే కాకుండా ఇతర జాతులవారు కూడా ఈ భూములకు గట్టిగా ప్రయత్నం చేస్తున్నారు. కొండజాతులకు కూడా తిరిగి ఈ భూములను యివ్వడానికి అవకాశం ఉండవచ్చు.

Sri D. RAMABRAHMAM :— అధ్యక్షా ! ఇప్పుడు అడవి, డిపార్టుమెంటువారు రిజర్వు అడవులు పెరిగినచోట్ల ముఖభాగంలో ప్లాట్లు వేస్తున్నారు. ఆ ప్లాట్లు చేలకు సమీపంలో బైట వేయడంవల్ల అచ్చట రైతాంగమునకు యిబ్బందులు కల్గుతున్నాయి. ఈ ప్లాటులవల్ల రైతాంగమునకు యిబ్బందులను తొలగించడానికి, సాగుచేసుకొనే రైతుల పొలాలకు దూరంగానున్న ప్రదేశాలలో ఈ ప్లాటులను వేయడం మంచిదని ప్రభుత్వం గుర్తిస్తుందా ?

The Hon. Sri P. THIMMA REDDI — ఈ ప్లాట్లను Reserve Forest లో అక్కడక్కడ, ఎక్కడో ఒక్కొక్కటి Department వారు వుంచారు. ఆ ప్లాట్లున్న ప్రదేశాల్లో వీటివల్ల దగ్గరనున్న రైతాంగమునకు ఏమైనా నష్టం కల్గుతుంటే ఆ ప్లాట్లను దూరంగా వేయడానికి ప్రభుత్వం ఆలోచిస్తుంది.

Sri V. SRIKRISHNA — అధ్యక్షా! 1953-వ సంవత్సరంలో, composite మద్రాసు రాష్ట్రములో వ్యవసాయశాఖా మంత్రిగా వున్న శ్రీ నాగన్న గౌడ్ గారు గుంటూరు జిల్లాలో పర్యటించినపుడు ఆయన స్వయముగా కొన్ని ఫారెస్టు ప్రాంతాలు చూచారు. అచ్చటి ప్రజలు Memorandum లు సమర్పించారు. తరువాత యీ reserve forests విషయమై వారు తమ అభిప్రాయం తెలియజేశారు కూడా. అందులో అచ్చటి reserve forest లోని plots ను సాగుకు యివ్వడం అవసరమని అంగీకరించారు. దాని ప్రకారం మరల ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తూ యీ reserve forest లోని ప్లాట్లు వ్యవసాయాని కివ్వడం విషయమై నేను ఒక లేఖ ప్రభుత్వానికి వ్రాశాను. దానిమీదట ప్రభుత్వంనుండి rejected అని సమాధానం వచ్చింది. దానిని పరిశీలించి ప్రభుత్వం ఆ భూములు సేద్యాని కిచ్చే విషయమై, యిప్పుడు తమ దృక్పథం మారినతర్వాతనైనా, పునరాలోచించి అనుమతిస్తారా?

The Hon. Sri P. THIMMA REDDI — ఎప్పుడు విచారణ చేశారు, ఎలాగ చేశారు, దాని పర్యవసానం ఏమిటని చూచి ఆ report లో వుంటే వ్యవసాయమునకు యివ్వడానికి ఏ అభ్యంతరం వుండదు.

Sri K. RANGA RAO:— అధ్యక్షా! ఈ forest area సందర్భంలో పంచాయితీ ఫారెస్టులను తీసుకున్నారు. ఫారెస్టు డిపార్టుమెంటువారు తీసుకోకముందు, వాటిని సాగు చేసుకుంటూ వున్నారు. Forest Department తీసుకున్న తరువాత సాగుకు అభ్యంతరం చేస్తున్నారు. వెనుకటి పద్ధతివలె సాగు చేయడానికి అనుమతి నిస్తారా?

The Hon. Sri P. THIMMA REDDI:— ఫారెస్టులు పంచాయితీలలో అభివృద్ధి చెందుతాయని అనుకున్నారు. కాని,

అవి అభివృద్ధి చెందకపోవడంవల్ల తిరిగి ఫారెస్టు డిపార్టుమెంటు పంచాయితీలనుండి వాటిని తీసుకున్నారు.

Sri G. NAGABHUSHNAM —May I know Sir, how the forest lands are going to be distributed among the people taking the present circumstances into consideration in as much as some of the lands are in the possession of the people and already being cultivated ?

The Hon. Sri P. THIMMA REDDI — ఏ ఏ భూములు ఇవ్వాలో నిర్ణయము చేసుకున్నతరువాత సాగుకు ఇవ్వడం జరుగుతుంది.

*Contribution from the Railway income to the Andhra State*

*514—Q. Sri S. NARAYANAPPA —Will the Hon. the Deputy chief Minister be pleased to state:

(a) whether any contribution is allotted from the Railway income by the Central Government to Andhra State, and

(b) if so, the amount allotted for this year ?

The Hon. Sri N. SANJEEVA REDDI —

(a) The answer is in the negative.

(b) Does not arise.

*Enhancement of cattle pound charges*

*515—Q. Sri S. VEMAYYA :—Will the Hon. the Minister for Land Revenue be pleased to state:

(a) Whether there is enhancement of cattle pound charges for the last 5 years,

(b) if so, under what circumstances they were enhanced, and

(c) whether deposit is insisted on owners of the cattle ?

The Hon. Sri K. KOTI REDDI :—

(a) Yes.

(b) Representations were received by the Government to the effect that much damage to trees and crops was being caused by straying cattle and that steps should be taken to prevent the menace. The Government examined the suggestions made in this regard and considered that it was necessary to enhance the fines levied in respect of the impounded cattle.

(c) No.

Sri P. NARASIMHA REDDI :— తోటలు వేసివున్న ప్రాంతాలలో public రోడ్లపైనుండే చోట్ల చెట్లను మేకలు పాడు చేసే ప్రమాదం వుంది కనుక తోటలలోనికి వచ్చే మేకలపై పన్ను వేసే ప్రయత్నం చేస్తారా?

The Hon. Sri K. KOTI REDDI —7 సంవత్సరముల నుండి impounding charges హెచ్చుచేస్తున్నారు. ఆ ప్రాంతాలు నాకు కూడా తెలుసును. అయినప్పటికి ఆలోచన చేస్తాం.

Sri V. CHIDANANDAM.— ఈ పశువులను బందెలదొడ్లో పెట్టడానికి కొన్నిచోట్ల బందెలదొడ్లు లేనిచోట్ల తోటలు నాశనము అవుతున్నాయి. కనుక క్రొత్తగా బందెలదొడ్లు కట్టిస్తారా? అని అడుగుతున్నాను.

The Hon. Sri K. KOTI REDEI:— లేనిచోట్ల కట్టడానికి ప్రయత్నం చేయవలసినదే అనుకుంటున్నాను. ఆ ప్రాంతాలు నాకు కూడా తెలుసును. అక్కడి గ్రామోద్యోగస్తులు కూడా సహకరిస్తారని అనుకుంటాను. బందెల దొడ్లు కట్టడానికి ఏర్పాట్లు చేసాము.

*Appointment of a Committee to Investigate into the Development schemes in Andhra*

* 515 Q.—Sri G. SURYANARAYANA:—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state:

(a) whether the Government have appointed any Committee to investigate into the Development

Schemes in Andhra, and to recommend to the Planning Commission to be included in the Five Year Plan according to priority, as promised by him during his tours in the Districts;

(b) if so, whether that Committee consists of only officials or whether there is a place for the non-official Members, and

(c) if not, why not?

The Hon. Sri D. SANJIVAYYA—

(a) No, Sir, The matter is under active consideration.

(b) Does not arise.

(c) Does not arise.

Sri G. SURYANARAYANA — ప్లానింగు కమీషను ఒక కమిటీని వేస్తుందన్నారు. ఎవరెవరిని వేస్తారో చెప్పగలరా ?

The Hon. Sri D. SANJIVAYYA·— ఆ కమిటీ యింకా నిర్మించ బడలేదు. అందుచేత ఎవరు సభ్యులు అని చెప్పడం సాధ్యంకాదని మనవి చేస్తున్నాను.

Sri T. NAGI REDDI —ఇప్పటికే ఈ development కు సంబంధించిన కమిటీ యిచ్చినటువంటి రిపోర్టులో చేసిన సూచనలు పరిశీలించి ఒక నిర్ణయానికి వచ్చారా, లేదా ? రాయలసీమకు సంబంధించిన యీ సూచనలు ఆచరణలో పెట్టడానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

The Hon. Sri D. SANJIVAYYA :— ఆ కమిటీ సమర్పించిన కొన్ని సిఫార్సులను అంగీకరించి వాటి విషయంలో చర్య కూడా తీసుకున్నాం అన్న సంగతి మీ కందరకు తెలుసును. మిగతా సూచనలను పరిశీలించి తగుమైన చర్యలు తీసుకుంటామని హామీ యివ్వగలను.

Sri K. V. S PADMANABHA RAJU:— తమ పర్యటన సందర్భంలో కమిటీ వేస్తామని చెప్పారు. యింకా వెయ్యలేదేమండీ!

The Hon. Sri D. SANJIVAYYA :— ఈ విషయం యింకా మంత్రివర్గం ఆలోచిస్తున్నది కొంతకాలం పడుతుంది.

Sri M. SUBBA REDDI :— మంత్రిగారు పర్యటన చేసే టప్పుడు వాగ్దానాలు యివ్వటం, ప్రశ్నల సమయంలో ఆలోచన జరుగుతుందనడం యింతవరకు జరుగుతూ వస్తున్నది. ఈ ఆలోచనలకు ఒక కాలపరిమితి వున్నదా ?

The Hon. Sri D. SANJIVAYYA :— ఏ పర్యటన సందర్భంలో ఎప్పుడు నేను చెప్పినదీ నాకు అర్థం కావడం లేదు. జిల్లా పర్యటన అని చెప్పినట్లు నాకు కనిపిస్తున్నది. Specific గా ఫలానా place, time, అని చెప్పితే దానికి నేను సమాధానం యివ్వగలను.

Sri K. GOVINDA RAO :— లోగడ District Planning Board విషయంలో ఆలోచన చేస్తున్నాం అని చెప్పారు. ఇప్పుడు తిరిగి అదే చెబుతున్నారు. కనీసం ఎప్పుడు యీ ఆలోచన పూర్తవుతుందో చెప్పగలరా ?

The Hon. Sri D. SANJIVAYYA :— ఆలోచన విషయం యిదివరకు చెప్పినది వాస్తవం, యిప్పుడు చెప్పినది వాస్తవం. గాని ఖచ్చితంగా ఎప్పుడు పూర్తవుతుందో చెప్పలేను. త్వరగా చేయగలను.

* 517 Q— Sri Lakshman Das rose to put the question on behalf of Srimathi T. Kotamma Reddi.

Mr. SPEAKER — The Deputy Chief Minister will answer.

Sri K. RAJAGOPAL RAO :— Point of order Sir, ఈ ప్రశ్న కాగితంలో Minister for Education and Industries జవాబు యిచ్చే టట్లున్నది. ఇప్పుడు డిప్యూటీ ముఖ్యమంత్రి గారిని జవాబు చెప్పమంటున్నారు. ఈ port folio మార్పులు మాకు తెలియదు. సభ్యులకుకూడా యీ మార్పులను తెలియచేయాలని కోరుతున్నాను.

Mr. SPEAKER :— The question is postponed to to-morrow.

Sri K. RAJAGOPALA RAO — The question as printed is addressed to the Hon. Minister for Education and Industries. Have the portfolios been changed and with whom is this portfolio now?

పోర్టుఫోలియో మార్పులు అందరికీ తెలియచేయాలని కోరుతున్నాను. ఈ Women's Welfare Department ఎవరు deal చేస్తున్నారు?

The Hon. Sri N. SANJEEVA REDDI—The Chief Minister is dealing with it.

Mr. SPEAKER — It appears that it has already been published in the Gazette.

*Coconut Research farm in Amalapuram*

*518 Q - Sri B. APPALASWAMY — Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state whether there is any proposal before the Government to establish a coconut research farm in Amalapuram taluk, East Godavari District?

The Hon. Sri P. THIMMA REDDI:— The Government have already sanctioned a scheme for the establishment of a Regional Coconut Research Station near Ambajipet in Amalapuram taluk, East Godavari District.

అధ్యక్షా! తూర్పుగోదావరిజిల్లా అమలాపురం తాలూకా, అంబాజీపేటలో Regional Coconut Research Station పెట్టడానికి sanction చేశాము.

*New Railway lines recommended to the Central Government in Andhra State.*

*519 Q:- Sri S. NARAYANAPPA :— Will the Hon. the Deputy Chief Minister be pleased to state —

(a) the number of new railway lines recommended to the Central Government in our Andhra State and what they are?

4

(b) whether there is any priority list prepared for undeveloped areas in Rayalaseema and other areas;

(c) whether the new railway lines from Guntakal to Tumkur District in Mysore State is proposed (via) Vajrakarur, Uravakonda, Beluguppa, Kalyandrug Kambadoor, Penukonda and Madakasira,

(d) the number given in the priority list,

(e) when the recommendations of the Andhra Government have been sent to the Central Government, and

(f) whether any reply has been received in this connection from the Central Government ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) No new railway lines have been recommended to the Central Government.

(b) No.

(c) The matter is under the considerationof the State Government and the Government of India will be addressed in due course.

(d), (e) & (f); Does not arise.

Sri S. NARAYANAPPA.— Guntakal స్టేషనునుంచి వజ్రకరూరుమీదుగా మైసూరు స్టేటులోని అరిసికెరికి line సిఫారసు చేసినట్లు ఆ మధ్య సెలవిచ్చారు. ఈ line ఎప్పుడు సిఫారసుచేసి Planning Commission కు పంపారు. Planning Commission నుండి బదులు వచ్చిందా ?

The Hon. Sri N. SANJEEVA REDDI:—కేంద్రప్రభుత్వం వారి consideration లో ఉండి ఉంటుంది. రాష్ట్ర ప్రభుత్వం recommend మాత్రం చేస్తుంది.

Sri G NAGABUSHANAM:— Is the Minister aware that the Central Government intends to undertake to investigate and construct a railway line from Ryardrug to Chittaldrug ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—It is also considered to be a good proposal. We shall send up that proposal also.

Sri C. V. K RAO — కాకినాడ మీాద నుంచి mainline వేయమని Central Government కు 30 సంవత్సరాలనుంచి కాకినాడ ప్రజలు ఆందోళన చేస్తున్నారు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. కనుక, ఈ ప్రభుత్వానికి కూడా చాలాసార్లు మంత్రులకూ, గవర్నరులకూ, కూడా విజ్ఞప్తి చేస్తూ వచ్చారు. కనుక వెంటనే మంత్రిగారు చర్యతీసుకుని, mainline కాకినాడ మీాద నుంచి వేయిస్తారా?

The Hon. Sri N. SANJEEVA REDDI :— ఈప్రభుత్వం కూడా ఈ విషయమై కేంద్రప్రభుత్వానికి తెలియజేసింది. అది కొంత దూరం వెళ్ళి ఆగిపోయింది. మళ్ళీ తెలియపరచమంటే తెలియ పరుస్తాం.

Sri B. SANKARAYYA :— నెల్లూరుకు, రాయలసీమకు direct రైలుమార్గం ఉండేలాగున పడుగుపాడునుంచి బొంబాయి లైనులో కలుపుటకు investigation పూర్తిచేశారు. ఆ విషయమై ఈ ప్రభుత్వంవారు కేంద్రప్రభుత్వం వారికి తెలియజేసి ఆ line వేసేటట్లు చూస్తారా?

The Hon. Sri N. SANJEEVA REDDI :— ఈ లైను విషయమే కాకుండా, ఇతరలైన్ల విషయం కూడా Central Government వారి ఆలోచనలో ఉండవచ్చును. మేము చేసే పని తెలియజేయడం మాత్రమే.

Sri L. LAKSHMANA DAS :- పర్లాకిమిడి light railway improve చేయాలనీ అది Broad Gauge చేయాలని చాలా కాలం నుంచి అక్కడి ప్రజలు ఆందోళన చేస్తున్నారు. దాన్ని గురించి ప్రభుత్వం శ్రద్ధవహిస్తారా?

The Hon. Sri N. SANJEEVA REDDI :— ఎన్నిప్రశ్నలు వేసినా ఇదే ప్రత్యుత్తరం చెప్పవలసి వస్తుంది. ఎన్ని లైన్లు ఐనా వేయమని చెప్పగలంగాని అది నిర్ణయించడం Central Government కు సంబంధించిన విషయం.

*Vettis and Thalayaries in Ryotwari Areas.*

*520. Q.—Sri K. KRISHNA RAO — Will the Hon. the Minister for Land Revenue be pleased to state

(a) whether there is any proposal to enhance the scales of salary and allowance payable to Vettis and Thalayaris in Ryotwari areas and if so, when, and

(b) whether it is a fact that Vettis and Thalayaris in Ryotwari Villages situated within 5 miles from the Taluk Head Quarters are not entitled to any travelling allowance?

The Hon Sri K. KOTI REDDI :—

(a) The answer is in the negative.

(b) Yes. The grant of fixed travelling allowance to village servants of villages lying beyond a radius of 5 miles from the taluk headquarters is intended to meet the out-of-pocket expenses likely to be incurred by them for their journeys on duty to the taluk headquarters, particularly when the journeys necessarily involved spending a night away from their villages. No travelling allowance is paid to village servants of villages within a radius of 5 miles from the taluk headquarters as they would not ordinarily have to halt at night at taluk headquarters and would not therefore incur any expenditure in connection with their journeys.

Sri K. KRISHNA RAO.— అధ్యక్షా! తాలూకా head quarters కు 5 మైళ్ళలోపున ఉంటే వెట్టీలకు తలయారీలకు ఏమీ భత్యం ఇచ్చుటలేదు. వారు అక్కడున్న తహసీల్దారకు, రెవిన్యూ ఇనస్పెక్టర్లకు వెట్టిచాకిరీ చేయవలసి వస్తోంది. అందువల్ల వారు ఎక్కువ కష్టములు పడవలసి వస్తోంది కనుక ప్రభుత్వం వారు 5 మైళ్ళు లోపల ఉన్నారనే నియమం పాటించకుండా వారికి కూడా T. A. ఇస్తారా?

The Hon. Sri K. KOTI REDDI :— వారు పైవేటు పని చేయుటకు లేరు. ప్రభుత్వం పనిచేయడానికే ఉన్నారు. T. A. సమాచారం ఆలోచించవలసిన విషయం.

Sri K. MALAKONDAYYA — ఈ గ్రామోద్యోగు లంతా దాదాపు నెలకు 18 రూపాయలు జీతంతో జీవితం గడుపుతున్నారు. ఈ 18 రూపాయిల జీవితంతో గడపాలంటే సాధ్యంకాదు. నాకు తెలిసి నంతవఱకూ ప్రపంచంలో ఎక్కడా 18 రూపాయిల జీతం తీసుకుని పనిచేస్తున్నవాడు లేడని అభిప్రాయ పడుతున్నాను. ఇదివఱకు ఎసెంబ్లీలో ఈ question raise చేస్తే జీతాలు పెంచుటకు డబ్బులేదన్నారు. హరిజన hostels లో గాని, హైస్కూళ్ళలోగాని ఈ వెట్టి మాతాదుల పిల్లలకు fees లేకుండా సౌకర్యం కలిగిస్తారా ?

The Hon. Sri K. KOTI REDDI :— చూస్తాం.

Sri A. VENKATARAMA RAJU — రాష్ట్ర గ్రామోద్యోగుల సంఘంవారు తాలూకా head quarters ను గ్రామంనుంచి టపాతీసుకుని వెళ్ళుటకు ప్రతిగ్రామానికి cycle ఉంటే బాగుంటుందని తీర్మానంచేసి పంపారు ఆ సౌకర్యం కలిగించుటకు ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

The Hon. Sri K. KOTI REDDI — Cycle ఇవ్వవచ్చును గాని ఖర్చువారు పెట్టుకోలేరు. గవర్నమెంటు cycle ఇస్తే విరిచి పారేసారు.

*Promotion of Deputy Collectors as Collectors.*

*521 Q.—Sri KOLLA VENKAIAH — Will the Hon. the Chief Minister be pleased to state

(a) whether any promotions have been made from the Deputy Collectors' cadre to the Collectors' cadre from 1st October 1953 to date ;

(b) if so, the number of officers promoted ; and

(c) whether the promotions were made strictly on the basis of period of service ?

The Hon. Sri T. PRAKASAM :—

(a) Yes.

(b) Seven.

(c) No.

(a) అవును ; (b) 7 గురు (c) ఎవరూ లేరు.

Sri KOLLA VENKAIAH — ఈ ప్రశ్నలో C, భాగానికి సమాధానం సరిగా రాలేదు. ఏ పద్ధతులమీద చేశారో సెలవిస్తారా?

The Hon. Sri T. PRAKASAM — వారి వారికి ఉండే టటువంటి merits మీద చేశాం.

*Refund of Deposits to the contractors in Madanapalle Sub Division under the Highways Department.*

*522 Q.- Sri D. SEETHARAMAIAH — Will the Hon. the Deputy Chief Minister be pleased to state

(a) whether it is a fact that in Madanapalle Sub-Division, the deposit amounts of the contractors under the Highways Department (Public Works Department) are not returned even after eight months of taking the check measurements ;

(b) if so, who is responsible for this delay, and

(c) whether the Government will expedite such payment ?

The Hon. Sri N. SANJEEVA REDDI .— Clauses (a) & (b) : According to the rules, security doposits are refundable only after the expiry of six months from the date of completion of the work or the rectification of the defects, whichever is later. There are no cases of undue or avoidable delays in refunding deposits in respect of Government works in the Chittoor Division. As regards District Board works, it has been reported that the deposits in certain cases are pending for the reason that sufficient credit has not been made available by the District Board, Chittor, to the Divisional Engineer (Highways) for refunding the doposits. In one case where the work was ordered to be suspended, the

deposit could not be refunded pending a decision on the question of execution of the work.

(c) Instructions will be issued to the Chief Engineer (Highways) to expedite refund of the deposits.

Sri D. SEETHARAMAIAH — ఇప్పుడు ఒక కేసులో deposit refund ఇవ్వలేదు, check measurement తీసుకోవడం close ఐనది కాబట్టి deposit refund చెయ్యకుండా ఉండడం సరియైనదా అని ప్రశ్న వేస్తున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI — కారణం చెప్పాను. That covers this supplementary question also

Sri C. SUBBARAYUDU — ఒక్క చిత్తూరు జిల్లాలోనే కాకుండా అనంతపురం జిల్లాలో కూడా సంవత్సరాలతరబడి deposit లు refund చేయవలసి ఉంది. Refund చేయుటకు ఉత్తర్వు చేస్తారా?

The Hon. Sri N. SANJEEVA REDDI — చాలా జిల్లా బోర్డులు అప్పులలో పడినవి. దాన్ని గురించి ఆలోచిస్తాం.

Sri S. VEMAIAH — ఈ డిపాజిట్ల refund విషయములో చిన్న చిన్న డిపాజిట్లను తీసుకొనుటకు పలుమార్లు రావడానికి అగు ఖర్చు అసలు రావలసిన మొత్తం కంటె అదనము అవడంవల్ల, డిపాజిట్లను వెంటనే ఇచ్చుటకు ప్రభుత్వం ఏమైనా సూచనలు చేస్తారా?

The Hon Sri N. SANJEEVA REDDI - కావలసినది డబ్బు. వట్టి సూచనలతో ప్రయోజనం లేదు. జిల్లాబోర్డులో డబ్బు లేకుంటే ఏమి ఇస్తారు?

Sri K. RAMAIAH CHOWDARY — అధ్యక్షా, ఈ డిపాజిట్లు వాపసు రిఫండు చేసే విషయంలో కంట్రాక్టర్లు చాలా బాధపడు తున్నారు. కోర్టులో దావా వేసి తీసుకొనుటకు తయారగు చున్నారు. కోర్టు ఖర్చులనుకూడ ప్రభుత్వం భరించవలసి వుంటుంది. ఇందుకు ప్రభుత్వం ఏదైనా చేస్తుందా? అదీగాక తీసుకొనేటప్పుడు 2½% ఇచ్చేటప్పుడు 5% ఇచ్చే అలవాటు లేకుండా కంట్రాక్టర్లకు అనుకూలము కలుగ జేస్తారా?

The Hon. Sri N. SANJEEVA REDDI.—ఇవి అన్ని జిల్లా బోర్డు అప్పులు కంట్రాక్టర్ల విషయమే కాదు. స్కూలు మాష్టరుల విషయములో కూడా ఉంది. దీనిని general question గా solve చేయవలెను. ఇది చాలా చిక్కు అయినప్రశ్న. స్కూలు మాష్టర్లు మొదలుకొని కంట్రాక్టర్ల వరకు పరిష్కారము చేయవలెను. అందుకు వ్యవధి కావలెను.

Sri V. RAMA RAO— జిల్లాబోర్డుల విషయములో మారుటోరియం ప్రకటించే విషయం ఏమైనా ఉందా?

The Hon. Sri N. SANJEEVA REDDI — ఇది న్యాయమైనదా, అని ఆలోచించవలెను.

Sri D. LAKSHMAYYA:— అధ్యక్షా, 1946 వ సంవత్సరములో ఒక రోడ్డు కంట్రాక్టరు (Peddakurapad) డిపాజిటు కట్టారు. ఇంతవరకు ఆ డిపాజిట్టు ఇవ్వకపోగా అసలు డిపాజిటే తమకు జమ రాలేదని చెప్పారు, జిల్లాబోర్డువారు. ఆలాంటిది ఏదైనా ఉంటే ప్రభుత్వం చర్య తీసుకుంటుందా?

The Hon. Sri N. SANJEEVA REDDI — 46 వ సంవత్సరంనుంచి ఎన్నో జిల్లాబోర్డులు మారిపోయాయి. ఎన్నో ప్రభుత్వాలు మారినాయి, అప్పుడు కట్టిన డిపాజిటును గురించి ఇప్పుడు అడిగితే ఏమి చెపుతాను? ప్రత్యేకంగా వ్రాసి ఇస్తే చూస్తాను.

Sri VAVILALA GOPALAKRISHNAIAH:— జిల్లాబోర్డువారు డబ్బు లేదంటున్నారు. ఈ డబ్బుకూడ dessolve అయిపోతుందేమో?

The Hon. Sri N. SANJEEVA REDDI:— మీరంతా ఒప్పుకుంటే అలాగే చేస్తాము. మాకు ఏమీ అభ్యంతరం లేదు.

Mr. SPEAKER:- Questions from 523 and onwards will be taken up to-morrow. No fresh agenda will be issued.

## II LOUD SPEAKER ARRANGMENTS OUTSIDE THE ASSEMBLY HALL

Sri K. GOVINDA RAO — అధ్యక్షా, loud speaker ఏర్పాటును గురించి రెండు పర్యాయాలు విజ్ఞప్తి చేసుకొన్నాను. ఈ lobby నుంచి బయటకు loud speaker పెట్టించవచ్చును. ఇందుకు precedent ఉంది. వెనుక మద్రాసు అసెంబ్లీ వెలుపల loud speaker పెట్టడం జరిగింది. అందువల్ల శాంతిభద్రతలకు ఏమీ భంగము కలుగదు. చాలామంది పోలీసులు ఉన్నారు. అందువల్ల ఏర్పాటు చేయమని కోరుతున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI — దానిని గురించి ఆలోచించాము. బయట loud speakers ను సోమవారం నాటికి ఏర్పాటు చేయించగలమని సెక్రెటరీగారు చెప్పున్నారు.

## III MESSAGE FROM THE GOVERNOR

Mr. SPEAKER — The following message dated the 5th May 1954 has been received from the Governor of the State of Andhra.—

"In pursuance of Art. 207 (3) of the Constitution of India, I, C. M. Trivedi, Governor of Andhra, hereby recommend to the Andhra Legislative Assembly the consideration of the Andhra Electricity Supply Undertakings Acquisition Bill, 1954.

## IV ADJOURNMENT MOTIONS RE:

### *(1) INCLUSION OF SIDDHESWARAM PROJECT IN THE FIVE YEAR PLAN.*

Mr. SPEAKER — I am not able to make either head or tail of the adjournment motion.

Sri V. CHIDANANDAM :— మీరు అన్నింటికి త— తోక లేదని అంటున్నారు. I move,

"This House stands adjourned to discuss a matter of urgent public importance arising out of the failure of Andhra Government to successfully negotiate with Hyderabad Government and Central Government to include Siddheswaram project in the five year plan to develop the backward areas in Rayalaseema."

Mr. SPEAKER.— సిద్దేశ్వరం ప్రాజెక్టు అని మీ కాగితములో ఉందా ? Pass this on to the hon. Member.

Sri V. CHIDANANDAM —మన Deputy Chief Minister గారు నందికొండ ప్రాజెక్టు విషయం చాలా ముందుకు తీసుకొని వచ్చినట్లు వుంది. కృష్ణానదిపై అన్ని ప్రాజెక్టులు ఒకసారే ప్రారంభించ బడునని వారు చెప్పిరి. కడప, కర్నూలు జిల్లాలకు సిద్ధేశ్వరమువల్ల ఎక్కువ లాభము వుంది. నెల్లూరు జిల్లాలో కోవ్వూరు, ఆత్మకూరు తాలూకాలలో చాలానీరు పారుదల అవుతుంది. నందికొండ నుండి తీసుకొని పోవలసివచ్చిన అది తగ్గుచుంచి పోవలెను గనుక నెల్లూరులో పారుదల తగ్గిపోతుంది. బద్వేలు సిద్ధవటం తాలూకాల విషయంలో సిద్ధేశ్వరం ప్రాజెక్టు వాటికి వుపయోగపడుటకు యింకా investigation జరుగ లేదు. సిద్ధేశ్వరం కాకుండా నందికొండ project ను తీసుకొని వచ్చారు కదా అని, సిద్ధేశ్వరం ప్రాజెక్టును అమలుజరుపుటకు హైదరాబాదు, ఢిల్లీ ప్రభుత్వాలతో సంప్రతింపులు జరుపగోరి, ఈ అడ్జర్నమెంటు మోషన్ తీసుకొని రావడమైనది.

Mr. SPEAKER :—I rule the motion out of order.

*(2) Closing of High Schools in the State*

Sri K. V. S. PADMANABHA RAJU :—I move:

"This House stands adjourned to discuss a difinite matter of urgent public importance regarding closing of many high schools in Andhra rendering impossible spread of education in the country as against the directive principles of the Constitution."

Mr. SPEAKER ;—Yesterday the Hon. Minister for Local Administration said that he would make an

announcement regarding the final decision. Therefore this motion is also ruled out.

Sri K. V. S. PADMANABHA RAJU.— నేను యిచ్చినటువంటి adjournment motion మీాద మంత్రిగారు యేదైన statement యిచ్చినట్లైతే నేను move చేయదలచలేదు. ఇది విశాఖపట్నం జిల్లాకు సంబంధించిన సమస్య. ఇది చాలా తీవ్రమైన సమస్యగా వుంది. ఈ high schools ను గురించి ఒక నిర్ణయమునకు వచ్చి, మంత్రిగారు ఒక statement యిస్తే కొంత ఆందోళన తగ్గుతుందని తెలియజేస్తున్నాను.

Mr. SPEAKER —కొన్నిచోట్ల close చేస్తున్న schools ను గురించి నిన్న మంత్రిగారు House లో చెప్పామన్నారు.

The Hon. Sri P. THIMMA REDDI —ఈ high schools కు సంబంధించి రాష్ట్రములోని అనేకచోట్ల స్థానికంగా వున్న ప్రజలు కొంత డబ్బు స్థలాలు, భవనాలు మొదలైనవి యిస్తామని చెప్పి మాట యిచ్చారు ఆ వాగ్దానాలను కొంతవరకైనా ఎక్కడ నిలబెట్టుకుంటారో - అచ్చట schools మూసివేయబడవని చెప్పుతున్నాను.

*(III) Lepers in Government Hospital Parvatipur*

Mr. SPEAKER —శ్రీ గున్నయ్యగారు ఒక adjournment motion యిచ్చారు.

Sri P. GUNNAYYA — పార్వతీపురం గవర్నమెంట్ ఆస్పత్రిలో కుష్టురోగుల గురించి చర్చించడానికి అక్కడ ఏర్పడిన అత్యవసర పరిస్థితులను చర్చించడానికి యీనాటి సభా కార్యక్రమము వాయిదా వేయవలసినదిగా ప్రతిపాదిస్తున్నాను. పార్వతీపురం హాస్పిటల్‌లో యిప్పటికి సుమారు రెండుమాసాలనుండి కుష్టురోగులు అనేకవిధాలుగా బాధపడుతున్నారు. ప్రతివారం - బుధవారమో, శుక్రవారమో, ఒకరోజున డాక్టర్లు యింజక్షన్లు యిస్తూ వుండేవారు. యీ రెండు మాసాల నుండి అక్కడి డాక్టరుగారు మందులు లేవని చెప్పటమే

గాకుండా మందులను కొనుక్కోమని చెప్పుతున్నారు. కొనుక్కునే ముందు ఆయనగారు రు. 100/- లు యిచ్చినట్లయితే మామూలుగా ప్రతివారం యింజక్షనులు యిస్తూ, మందులుగూడ యిస్తానని చెప్పుతున్నారు. అంతే గాకుండా, బొబ్బిలిలో గూడ అదేవిధంగా కుష్టురోగులు ఆసుపత్రికి వెళ్ళితే వాళ్ళను ఏదో ఒక చెట్టుక్రింద వుంచి మందులు యిస్తున్నారు. వారివద్దనుండి గూడ డాక్టర్లు రు. 50/- రు. 100/- లు చొప్పున డబ్బు తీసుకుంటున్నారు. కాబట్టి ప్రభుత్వం వారు ఆ తాలూకాలలో వున్నటువంటి కష్టురోగులకు సరియైన మందులు సప్లయి చేయించి ఆ రోగులకు అన్యాయం జరుగకుండా వుండేలాగున చేస్తారని కోరుతున్నాను అంతేగాకుండా విశాఖపట్నంలో K. G. ఆసుపత్రి వుంది. మదరాసునుండి విడిపోయినతరువాత యిదే మన రాష్ట్రానికి పెద్ద ఆసుపత్రి. మదరాసులో వున్నప్పుడు అక్కడి ఆసుపత్రివారు శాసనసభ్యులకు ప్రత్యేకమైనటువంటి గౌరవము యిచ్చి తగినవిధముగా treatment యిచ్చేవారు. ఇప్పుడు మనం మదరాసు నుంచి విడిపోయినతరువాత ఈ K. G. ఆస్పత్రి ప్రాముఖ్యమైనది. ఈ నాలుగు రోజులలో కనీసము కొంతమందైనా, యీ K. G. హాస్పిటల్ కు వెళ్ళివుంటారు. ఎవరైనా పెద్దమనుష్యులు "కార్ల"లో వస్తే వారి కారు హారన్ మోత విని, ఆ ఆస్పత్రి డాక్టర్లు బైటికివచ్చి, వారికి కావలసిన మందులు యిస్తూ వుంటున్నారు. నా ఏరియా నుంచి కొంత మంది రోగులు యీ ఆసుపత్రికి మందులకొరకు వస్తే వారినిచూడటం లేదు. నేను ప్రత్యేకంగా యీ హాస్పిటల్ కు రెండురోజులనుండి వెళ్లుతున్నాను. నా బోటి తెలివితక్కువ, తెలివిలేని M. L. A. వెళ్ళితే ఆ డాక్టర్లు లెక్కపెట్టుతారా?

Sri K. VARADACHARI :—"తెలివిలేనివారు తెలివితక్కువ వారు" అని మాట్లాడటం యీ House కు నిండా భంగకరంగావుంది.

Sri P. GUNNAYYA:— ప్రత్యేకంగా యీ శాసన సభ్యులు ఎలక్షనులలో కొన్ని వేలు ఖర్చుపెట్టి శాసన సభకు వచ్చినటువంటి పెద్ద మనుష్యులు. ఈ శాసనసభ యిక్కడ జరుగుచున్నంత కాలము యీ K. G ఆస్పత్రి డాక్టర్లు M. L. A. ల వద్దకు వచ్చి వారికి కావలసిన వైద్య సహాయములు చేసేటట్లుగా, ఏర్పాటు చేయమని కోర్తు

తున్నాను. ఈ అత్యవసర విషయమును గురించి, చర్చించటానికి గాను, నేటి సభా కార్యక్రమమును, వాయిదా వేయవలసినదిగా అధ్యక్షుల వారిని ప్రార్థిస్తున్నాను.

Mr. SPEAKER —The motion also is ruled out of order.

## *V. Government Bills*

### *Sri Venkateswara University Bill 1954 (contd.)*

Mr. SPEAKER —We will now resume discussion on the Sri Venkateswara University Bill. I propose to give two hours, that is till 12 O'clock for general discussion and one hour for the Leader of the Opposition and the Minister in charge, and then put the motion to the vote. The Communist party has given some names The others who want to speak may send their names now.

Sri N. SIVARAMI REDDI — అధ్యక్షా: ఈ యూనివర్సిటీ బిల్లుమీద గత రెండు దినాలనుండి చర్చలు జరుగుచున్నవి. ఇప్పటికి స్పష్టముగా రెండు దృక్పథాలు యిందులో కనపడుతున్నవి. కమ్యూనిష్టుపార్టీ, తదితర పార్టీలు వెలిబుచ్చిన అభిప్రాయం ప్రకారం యీ University ని Residential University గా మాత్రమే వుంచినట్లయితే ఆంధ్ర విద్యార్థులకు ఆంధ్ర ప్రజలకు, ఐక్యతను చేకూర్చటానికి వుపయోగంగా వుంటుందనేది ఒక దృక్పథం; అది ప్రధానమైనది కూడాను, పోతే యింకో దృక్పథంగలవారు ఈ ఐక్యతను దృష్టిలో పెట్టుకోకుండా ఆంధ్ర ప్రజలలో ఆంధ్ర విద్యార్థులలో ఆంధ్ర ఉద్యోగస్థులలో కూడా అనేక చీలికలను తీసుకొని వస్తున్నారు. ఇప్పుడు ఈచీలుకలను యింకా ఎక్కువచేస్తున్నట్లు, వీరి వైఖరివల్ల స్పష్టమౌతోంది.

ముఖ్యంగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడి నప్పటినుంచీ ఆంధ్రుల ఐక్యతకు దోహదమిచ్చే కార్యక్రమమును ప్రభుత్వం తీసుకొన్న

వస్తుందని ఆంధ్ర ప్రజానీకము ఆశించారు. కాని ఆంధ్ర ప్రభుత్వం ఆంధ్రకు ముఖ్య పట్టణమును నిర్ణయించే విషయములోను High Court ను నిర్ణయించే విషయం లోను అవలంభించిన పద్ధతులు చూస్తే ఈ విభేదాలను యింకా ఎక్కువచేసి తద్వారా రాజకీయాధికారాలను నిలబెట్టుకోడానికి కృషి చేస్తున్నట్లు కనిపిస్తున్నది. ఐకమత్యము ప్రజాభ్యుదయాన్ని, ఐక్యతను పెంపొందించే టటువంటి పద్ధతులను అనుసరించటము లేదు. నిన్న మాట్లాడినటువంటి శ్రీ వేమారెడ్డి, శ్రీ లక్ష్మణదాస్ గార్లు ఆంధ్రులలో ఐక్యతను పెంపొందే టట్లుగా యీ యూనివర్సిటీని "Affiliating University" గా చేయవలసినదని చెప్పారు. 'Affiliating University' గా చేయుటములో అది దెబ్బ తింటుందని నేను విశ్వశిస్తున్నాను. నేను 1913 సంవత్సరములో మదరాసు యూనివర్సిటీలో చదువుకుంటూ వున్నప్పుడు మదరాసు విశ్వవిద్యాలయ, ఆంధ్ర విశ్వవిద్యాలయ విద్యార్థులకు ప్రొఫెసర్లకు విద్యా ప్రణాళికల విషయములో వాదోపవాదాలు జరుగుతూ వుండేవి. ఆంధ్రవిశ్వ విద్యాలయం వారు వాడుక భాషను గురించి మద్రాసు విశ్వ విద్యాలయం వారు గ్రాంథిక భాషను గురించి అనేక రాద్ధాంత సిద్ధాంతాలు జరుపుతూ వుండేవారు. ఇప్పుడు స్థాపించబడే University ఎటువంటి అభిప్రాయ భేదాలకు తావులేకుండా అందరి క్షేమమునకు వుపయోగ పడేటట్లుగా వుండాలని చెప్తున్నాను.

ఇకపోతే ఈ Affiliating University ఉండాలని వాదించే టటువంటి వాళ్ళు దీనివల్ల రాయలసీమ ప్రజానీకానికిని, రాయలసీమ విద్యార్థులకును ఎటువంటి ప్రత్యేక ప్రయోజనాలు కలుగుతాయో నిరూపించలేక పోతున్నారు. కాని దీనిని Residential University గా చేసినందువల్ల రాష్ట్రములో ఒకే University ఉండడానికిని, విద్యార్థులు ఒకే యూనివర్సిటీకి చెందిన వాళ్ళుగా భావించ డానికిని, గర్వించడానికిని అటువంటి ఐక్యతకును, దోహదమిస్తుందని గట్టిగా చెప్పుతున్నాను. ఈ విషయము ప్రభుత్వ పక్షములో ఉన్నటువంటివాళ్ళు గుర్తించ లేకపోవడం చాలా శోచనీయం. పోతే ఈ కమిటీలో నియమించి నటువంటి గోవిందరాజులు నాయుడు రంగధామరావు గార్ల రిపోర్టు చూచి

నట్లైతే వారు అందులో Residential University గా ఉంటేనే ఎక్కువ ప్రయోజనాలు ఉంటాయని స్పష్టముగా చెప్పారు. వాళ్ళ రిపోర్టు 4 వ పేజీలో ఈ విధముగా వ్రాయబడినది.

"There are distinct advantages in having at suitable centres, Universities of the residential and teaching type, and leaving to one University all the functions of affiliation in the rest of the State. There is no very great merit in dividing the duties of affiliation and external examination between two or more Universities and duplicating the mechanical functions of examinations. A further disadvantage may be that two neighbouring affiliating Universities in a State may vary in standards and this may lead to unhealthy competition".

ఈ విధంగా దీనిని Residential University గా చేయడం వల్లనే distinct advantages ఉన్నాయని అందులో చెప్పబడింది. ప్రత్యేకంగా Affiliated Universities చేయడం వల్ల University Competition పెరుగుతుందని గూడ స్పష్టంగా ఆ రిపోర్టులో పేర్కొనబడి ఉన్నది. పోతే ఈబిల్లులో ఉన్నటువంటి Statement of objects and reasons లో Affiliating Universities ఉండేందుకు చెప్పిన కారణాలలో ఏ ఒక్క కారణము కూడ సహేతుకముగా లేదు. దానిలో చెప్పిన ఒక కారణం ఏమిటంటే,

"There are at present 8 colleges in this area, but none providing Honours courses or conducting research work. It is time that greater and more adequate opportunities for higher studies up to the Honours and Post-graduate standard should be extended to students residing in this area. This is not possible under the Andhra University Act, unless its very structure, complexion and constitution are altered in a way detrimental to its interests".

ఈ కారణముకూడ ఏమాత్రము సహేతుకంగా లేదు. ఆంధ్ర senate ఈ రాయలసీమలో ఉండేటటువంటి Colleges ను ఈ University కే affiliate చేసి వాటిని నిర్వహిస్తామని చెప్పారు. తరువాత Andhra University Act ను సవరించడంలో కూడ పెద్దచిక్కులేవి ఉండవనికూడ నేను భావిస్తున్నాను. ఈ కారణం కూడ సహేతుకంగా లేదు. తరువాత ఈ Affiliating University ఉండాలనేందుకు ఇంకొక కారణం విద్యార్థుల సంఖ్య చాలా ఎక్కువగా ఉన్నదని వీరందరికి పరీక్షలు మొదలగునవి నిర్వహించటానికి ఒకే University కి కష్టమౌతుంది గనుక రెండు University లు ఉండాలని చెప్పుతున్నారు. ఈ కారణం కూడ ఏమాత్రము సహేతుకంగా లేదు. ఎందువల్లనంటే. మన ఆంధ్రలో ఉండేటటువంటి విద్యార్థుల సంఖ్యకంటె ఎక్కువ సంఖ్యను ఇతర రాష్ట్రాలలో ఒకే University నిర్వహిస్తున్నది. ఒకే భాష, ఒకే విజ్ఞానము, జాతి ఉన్నటువంటి ఇతర రాష్ట్రాలలో ఈ విధంగా రెండు Affiliating Universities ఎక్కడాలేవు కాని, Residential Universities ఇతర రాష్ట్రాలలో ఉంటే చూస్తున్నాము. ఈ విధంగా రెండు Affiliating Universities ఉండడం వల్ల ప్రమాద మేమిటంటే, యీ University విద్యార్థులు మధ్య శాశ్వతమైనటువంటి ఒక గోడను నిర్మించి, వాళ్లలో ఒక పోటీభావన్ని పెంపొందించడం జరుగుతుంది. అదే ఈ బిల్లుయొక్క ఉద్దేశ్యమైనట్లు కన్పిస్తుంది. కాని, రాయలసీమలో ఉన్నటువంటి విద్యార్థులు Affiliating University ఉండాలనే అభిప్రాయపడుతున్నారని, కొంతమంది చెప్పే కారణం కూడ వాస్తవం కాదు. మన అభిప్రాయమే మన దృక్పథమే అందరికీ కూడ ఉంటాయని ఆవిధంగా భావించడం పొరబాటు. ఎందుకంటే ఇంతకుముందు ముఖ్యపట్టణము సమస్య వచ్చినప్పుడు అనంతపురంలో High Court న్నూ, విజయవాడ గుంటూరులో ముఖ్యపట్టణం ఉండాలని రాయలసీమ ప్రజలు కోరి ఉన్నారు. ముఖ్యపట్టణం సమస్య అసెంబ్లీలో చర్చకురాకముందే ఈ అభిప్రాయాన్ని అనంతపురం ప్రజానీకము, కడప ప్రజానీకం వెల్లడిచేసింది. తరువాత అసెంబ్లీలో కర్నూలును సెలెక్టు చేయ

డంతో, అనంతపురం ప్రజలున్నూ, కర్నూలు ప్రజలున్నూ చాలా ఆశ్చర్యపడినారు. రాయలసీమ ప్రజలు మొదటినుంచి కూడ అనంతపురంలో హైకోర్టున్నూ, విజయవాడలో ముఖ్య పట్టణము ఉండాలనే చెప్పతున్నారు. కాని, మనమే అటువంటి అభిప్రాయ భేదాలు కలిగిస్తున్నాము. అదే విధముగా ఈ University విషయములో కూడ జరుగుతున్నది.

(At this stage the Deputy Speaker occupied the Chair)

Sri V. CHIDANANDAM —రాయలసీమకు Capital కావాలనే మేమందరము మొదటనుంచీ unanimous గా కోరుతూ వుండినాము. రాయలసీమ ప్రజానికం Capital అక్కరలేదని చెప్పినారనే మాట తప్పు అని చెప్పుతున్నాను.

Sri N. SIVARAMI REDDI — 20 వేల ప్రజానీకం సమావేశమైన మహాసభలో రాయలసీమకు హైకోర్టు వుండాలని, విజయవాడలో ముఖ్యపట్టణం వుండాలని తీర్మానించినపుడు, రాయలసీమ ప్రజానీకమంతా చప్పట్లు గొట్టి, దానిని ఆమోదించారు. కాని ఈ కర్నూలు నిర్ణయం ఏవిధంగా జరిగిందంటే మద్రాసులో ఈ రాయలసీమ శాసన సభ్యులు సమావేశమై, రాయలసీమ ప్రజలతో తమ పలుకుబడిని, ఘనతను పెంపొందించుకొనేందుకున్నూ, తాము యీ 4, 5 సంవత్సరాలలో సాధించిందేమిటంటే, ఈ ముఖ్యపట్టణాన్ని సాధించామని చెప్పుకోడానికిన్ని ఈ విధంగా ముఖ్యపట్టణం రాయలసీమలోనే వుండాలని పట్టుపట్టి చేశారు. అదే విధముగా, యీ 5 ఏళ్ళ కాలములో ఒక University ని కూడ సాధించామని చెప్పుకోడానికి ఈ నాడు వారికి ప్రత్యేక University వుండాలంటున్నారు. ఇది ఆంధ్ర ప్రజలలో విరోధాలను పోటీలను పెంపొందింపచేయుడానికి చేసే ప్రయత్నమే కాని, మరేమి కాదని చెప్పుచున్నాను. తరువాత ఈ University Construction గురించి ఒకటి రెండు మాటలు చెప్పదలచుకొన్నాను. ఈ Construction ప్రకారం, Syndicate కు, Vice-Chencellor కు విశేషమైన అధికారాలు వున్నాయి. Senate మాత్రము ఏలాటి బాధ్యత వహించేటటువంటి సంస్థగా వుండడంలేదు. Senate ఏమైనా బాధ్యత వహించాలంటే, 'Senate నుంచి Syndicate కు ఎన్ను

కొనేటటువంటి సభ్యుల సంఖ్యను పెంచినట్లైతే, Syndicate ఆ రకంగా Senate కు బాధ్యత వహించిన దవుతుంది. తరువాత Vice-Chancellor ను నియమించే విషయంలో బిల్లులో పేర్కొన్న పద్ధతి ప్రజాస్వామ్య పద్ధతికి పూర్తిగా విరుద్ధంగా వుంటుందని చెప్పవలసి యున్నది. కనుక appoint చేసే పద్ధతిని అనుసరించకుండా, Vice-Chancellor ను ఇప్పటిమాదిరిగనే ఎన్నుకొనే విధంగా చేయవలసిందని అభిప్రాయపడుతున్నాను. తరువాత ఈ Senate లో ప్రస్తుతము graduates కు కొంత ప్రాతినిధ్యము వుంటున్నది గాని, కాలేజీలలో వుండేటటువంటి విద్యార్థులకు మాత్రము ప్రాతినిధ్యము లేదు. కనుక వారికి గూడ అటువంటి అవకాశము యివ్వవలెనని కోరుతూ విరమిస్తున్నాను.

Sri N. V. L. NARASIMHA RAO :— ఉపాధ్యక్షా! నిన్న, యీ రోజున జరిగిన చర్చ అంతా సాంగోపాంగంగా విన్నాను. నేను యీ చట్టము చదివినాను. యిది ఏదో కొత్తదిగానూ, నవీనంగాను, చాలా original గా వుంటుందని అనుకొన్నాను. అయితే యిదివరకే మన ఆంధ్రయూనివర్సిటీగా వున్నదాన్నే కాపీ తీశారట. అయితే కాపీ తీస్తే తీశారుగాని, దానికి Preamble గూడా ఒకటి వున్నదని మన విద్యాశాఖా మంత్రిగారు చెప్పారు. ఇక్కడ ఒక కొత్త విశేషము కనబడుతున్నది. అంటే తిరుపతిలో జరగబోయేది కొంత వేదాంత మార్గంగా వుంటుంది. ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతముగావున్నది. అది చాలా original గా వుంది. ఎందుకంటే తిరుపతికొండ మీద జరిగేపనికి, కొండక్రింద జరిగే పనికి సరిపోతుంది. మనకు స్వతంత్రము రానికాలములో పూర్వము బౌద్ధులు విశ్వవిద్యాలయాలు స్థాపించినప్పుడు చాలా మహోన్నతముగా మన నలంద, తక్షశిల అటువంటివి వున్ననాటి గురుశిష్య సాంప్రదాయాలు తిరిగి యిప్పుడు పునరుద్ధరిస్తున్నారు అనుకొన్నాను. అది కాకపోయినను తిరుపతిలో యీ 3 సిద్ధాంతాలు అవలంభించినప్పుడు, మన ఆకారము కూడా కొత్త ఆకారముగానే వుంటుంది. ఎందుకంటే, దేమునికి మనము మొక్కుతుంటున్నాము. గనుక మన నీలాలు కూడా అక్కడవుండవు. అందుచేత మనము పరిపూర్ణమైన వేదము అవలంబిస్తున్నాము అని అనుకున్నాను. అయితే యిప్పుడు ఆలోచించవలసింది ఏమిటంటే, మనకు స్వతంత్రము వచ్చిన

తరువాత విశ్వవిద్యాలయాలు ఏ విధంగా వుండాలి అని ఒక నూతన మార్గము త్రొక్కవలసి యున్నది. ఇదివరకు విశ్వవిద్యాలయాలు ప్రారంభించినవి ఉంటే అవి ఎందుచేత యింగ్లీషు భాషలో ప్రారంభించి వున్నారో మీకు అందరికి తెలుసును. ఎందుకంటే, బ్రిటిషు సామ్రాజ్యము క్రింద మనము అందరము గుమాస్తాలుగా తయారై, ఇంగ్లీషు భాషలోనే వ్రాయటానికి కాలేజీలు ప్రారంభించారు. అవి ఒకే పద్ధతిలో లేవు. అక్కడ ఒకటి, అక్కడ ఒకటి ఏర్పాటు చేస్తూవచ్చారు. దానికి తగ్గటుగా యీ సమయములో మనకు క్రైస్తవ మతము బోధించుటకు మిషనరీలు కూడా వచ్చారు. వారు కూడా యీ Colleges ను అక్కడక్కడ ఏర్పాటు చేస్తూ దీనికి ఏదో కొత్తగా ఉండాలి అని ఒక పరీక్ష పెట్టారు. అంటే బి ఎ. అయినా, యమ్. ఎ. అయినా ప్యాసు అయియుంటే గుమాస్తాలుగా ఏర్పాటు చేయువచ్చును అని యీ University లను ఏర్పరచారు. ఇప్పుడు ఆ పద్ధతి అంతాపోయి, మనకు స్వతంత్రము వచ్చింది గనుక యీ Universities ఏమి తయారుచేస్తున్నాయో మీకు అందరికి తెలుసు. ఇక్కడ మనకు వున్న University కి ఆంధ్ర యూనివర్శిటీ అని పేరు పెట్టారు. దీనిలో మనవాళ్లు, ఏవిధంగా తయారు అవుతున్నారో కూడా మీకు అందరికి తెలుసు Univerisity లో చదువు పూర్తి అయిన తరువాత వుద్యోగాలు లేకపోవటమువల్ల వాటికోసం ఎంత యిబ్బంది పడుతున్నారో అదికూడా మీ కందరకు తెలుసు. ఇప్పుడు మన ఆంధ్ర యూనివర్శిటీలో తయారు అయ్యే నమూనాలే మరల యిక్కడతిరుపతిలో కూడ తయారు చేస్తే, దానివల్ల ఎంత ఆందోళన వుంటుందో తెలిసియే, బహుశ మన విద్యాశాఖామాత్యులు కేవలము ఇక్కడ వేదాంతమే పెట్టుతామని అన్నారు. ఎందుకంటే వేదాంతం పెట్టితే అసలు యీ రాయలసీమవారు మన పద్ధతులను అవలంభించి కొంత ఆందోళన జరిపి మాకు Capital కావాలి, మాకు హైకోర్టు కావాలి అని ఈ వేదాంత మార్గంలోని విశిష్టాద్వైతమే వారిలో వారు మాకు కాపిటల్ అక్కర లేదని చెప్పడం బహుశ యీ పద్ధతే అవలంభిస్తున్నారని అనుకుంటున్నాను. కాని దీనితో ఆగకుండా యీ నమూనా ఎప్పుడైతే ఏర్పాటు చేశారో దానితో కూడా వారి పరీక్ష సిద్ధాంతాలు కూడా వస్తున్నాయి. పరీక్షలలో ఏమవుతున్నదో మీకు అందరికి తెలుసు. పూర్వము లాగా

చదవడం వ్రాయడం, పరీక్షలు ప్యాసు కావడం కనబడడము లేదు. ఇదంతా చేయకుండా పరీక్ష ప్యాసుచేయుటానికి ఒకేసారి direct attack ఆరంభిస్తున్నారు. అంటే పరీక్షలు కాగానే ప్రొఫెసర్లను పట్టుకోవటము జరుగుతున్నది. దీనికి కూడా కష్టముగా వుంటుందని తండ్రులు సెనేటు మెంబర్లుగా తయారు అవుతున్నారు. అంటే వారి వుద్దేశ్యము మా పిల్లవాడిని ఆనర్సుకోర్సులో బాగా ప్యాసు చేయించుకోవచ్చుననే. అయితే యిక్కడ మన కొత్త మంత్రివర్గము వారు ఆంధ్ర రాష్ట్రము రాగానే ఏదో ఉత్తేజమైన సంస్థ స్థాపించాలనే వుద్దేశముతో డబ్బుకొరకు వెదికితే, చివరకు యీ తిరుపతి వెంకటేశ్వర్లు కనబడ్డట్లు వున్నది. అంటే ఈ వెంకటేశ్వర్లవద్ద డబ్బు బాగా పోగైనది, దీన్ని కాస్త వుపయోగించుకుందాము అనే ఆశతో యీ University స్థాపించ బూనుకున్నారు. దీనికి ఒక వుదహరణ నాకు జ్ఞాపకము వస్తున్నది. "పనసకాయ దొరకితే తద్దినము పెట్టాలి." అన్నట్లు డబ్బుదొరికితే ఖర్చు చేయాలి అనేది కనబడుతున్నది. అందుచేత యిక్కడ యీ డబ్బును ఏ విధంగా కాజేదాము అని పట్టు పట్టుతున్నారన్నమాట. ఇప్పుడు యీ University సిద్ధాంతాల విషయములో ప్రొఫెసరు రాధాకృష్ణగారు, గొప్పవారు విద్యావంతులు, కొన్ని సిద్ధాంతాలు చేశారు. తరువాత మహాత్మాగాంధీగారు కూడా Universities యీ విధంగా వుండాలి అని కొన్ని సూచనలు చేశారు. యువకులు పూర్వములాగా గుమాస్తాలు పనిచేయవలసినవారు కాదు, ఈ దేశము ఎట్లాపరిపాలించాలి అనే విచక్షణ చేయవలసిన వారు, democracy ని పోషించవలసిన వారు. Justice, fraternity, liberty, equality అనేవి యీ యూనివర్సిటిలలో ప్రతిఫలింప చేయవలసినవారు కాని అటువంటివి యిప్పుడు యూనివర్సిటీలలో ప్రతిఫలింప జేయబడుతున్నవా? Equality ప్రతిఫలిస్తున్నదంటే అది సామాన్యమైనది కాదు.

పరీక్షలు ప్యాసు అయినతరువాత ఎక్కడకూడా ఉద్యోగము లేకుండా వుంటున్నప్పుడు, సినీమాలకు తిరగవచ్చునని వుద్దేశ్యము కనబడుతున్నది. వుద్యోగాలు ఏర్పాటు చేసినప్పుడు justice అనేది ఎక్కడ కనబడడములేదు. అట్లా ప్రతిఫలించే యూనివర్సిటీలలో ఒక agriculture వ్యాప్తమే కాదు, పరిశ్రమలుకూడా వృద్ధిచేయుటకు

అవకాశము వున్నది. మన దేశము వ్యవసాయ దేశము. పరిశ్రమలు ఎన్నో వున్నవి. గ్రామాలను పునరుద్ధరించాలని యీ మధ్య మంత్రులు అందరు పర్యటనచేసి, జోగన్నపాలెము అనే గ్రామములో యింకను అనేకచోట్ల సంఘాలు స్థాపించివచ్చారు. ఈ విధంగా ప్రచారము చేసే వారు యీ పరిశ్రమలు ఏ విధంగా వృద్ధి పొందగలవు అనే ఆలోచించే వారు యూనివర్సిటీలలో వాటికి స్థానము కలుగజేయాలి. అంటే మీరు పెట్టే సంస్థలు వేరు, వారునేర్పే విద్యలు వేరు. ఒక విధంగా చూస్తే ప్రొఫెసరు మామిడిపూడి వెంకట రంగయ్యగారు, ఆంధ్ర కేసరి ప్రకాశం పంతులుగారు సీసా పాతదిగావచ్చును గాని క్రొత్తసారాయిని అందులో పోస్తున్నారనిచెప్పి ఒక అప్పీలుకూడా చేశారు. అయితే పంతులుగారు దీర్ఘమైన నిద్రావస్తలో వున్నారు. గనుక వారు బహూశా చూడక పోవచ్చును. వారు ముఖ్యమంత్రిగావుండి యిటువంటి యూనివర్సిటీ బిల్లును తీసుకొని వచ్చేరంటే వారు ఈ విషయములో పునరాలోచించ వలసివుంది. మన రాష్ట్రములోని మహా జనానికందరికి ఈ యూనివర్సిటి ఏ విధముగా ఉపయోగ పడుతుందో అటువంటి యూనివర్సిటీని మన దేశములో పెట్టాలని నా ఉద్దేశము. కాని వార్తేరులోని యూనివర్సిటీని చూశాము. దాని నమూనా ప్రకారం యూనివర్సిటి యిక్కడ తిరుపతిలో పెడతామంటున్నారు. అది అఫిలియేటింగ్ యూనివర్సిటీ చేస్తామంటున్నారు. రాయలసీమ కాలేజీ మద్రాసునుంచి disaffiliate చేయబడలేదు. ఆ కాలేజీలను యిక్కడ ఆంధ్రయూనివర్సిటీకి affiliate చేయలేదు. ఇట్లా affiliate చేయకముందే, తిరుపతిలో Affiliating University చేద్దామా లేక Residential University చేద్దామా అనే ఆలోచన జరుగుతున్నది. ఈ విధానం అంతాచూస్తే బావాజీ మరంలాగు తయారవుతున్నది. అసలు యీ యూనివర్సిటీ ఏ రూపంలో వస్తుందో తెలియకనే, ముందుగానే యూనివర్సిటీ స్థాపిస్తామని అంటు న్నారు. ఇదంత జూస్తే ప్రరంలేనిదే అంతఃప్రరము అన్నట్లు అసలు యూనివర్సిటీ ఏ విధంగా వస్తుందనేది ఆలోచన లేకుండా చేస్తున్నట్ల వుతున్నది. ముందుబండి, దానికివెనుక గుర్రం కట్టి నడిపించే టట్లువుంది. ముందుగా అన్నిహంగులు ఏర్పాటు చేసికొనిన తరువాతనే యూనివర్సిటీని

ఏర్పాటు చేసుకోవడం మంచిది. తల ఒక ప్రక్క, మొండెము మరొక ప్రక్క వున్నప్పుడు తలకు మొండెము మరొక ప్రక్కను తగిలించి అతకకుండా చేస్తున్నారు. అందుచేత దీని విషయములో చక్కగా ఆలోచించవలసి వుంటుంది. డాక్టరు గోవిందరాజులు నాయుడుగారు ముందుగానే affiliating University ని చేయవద్దని సలహా యిచ్చారు.

తరువాత వైస్-ఛాన్సలరు అయిన Dr.V.S. Krishna గారు కూడా అదేవిధంగా సలహా యిచ్చారు. ఇటువంటి పెద్దలు, అనుభవజ్ఞులు చెప్పేటప్పుడు ప్రభుత్వంవారు ఈ సలహాలను త్రోసివేస్తున్నారు అనుకుంటున్నాను. Planning Commission తయారుచేసే ప్రణాళికలలో అనేకమైన industries వున్నవి. ఇవన్నీ వృద్ధి చేయటానికి గాను, honest గా ప్రయత్నము చేయండి. మన అందరి కోసము ఒక నమూనాగా ఒక గృహపరిశ్రమ పెట్టమని అంటున్నాను. అవి కాకుండా యింకను అనేకము వుంటున్నవి. వాటికి వీటికి ముడిపెట్టకుండా, conflict రాకుండా ఒక నమూనా industry ను వృద్ధికి తీసుకుని రండి. Jogannapalem లో పెట్టినట్లు చేయాలి. దేశములో నమ్మకము లేనివారికి ఈ Universities ఎందుకని అంటున్నాను. మంత్రులు పల్లెలలో పర్యటన చేస్తున్నారు. చదువుకున్నవారు బస్తీలకు వెళ్ళి పోయారు. చదువుకోనివారు పల్లెలోనే వున్నారు. ఈ పల్లెలు వెనుకబడినవిగా వుంటూ, మంత్రుల పర్యటనకు పనికివచ్చేవిగా వుంటున్నవి. పల్లెలు అభివృద్ధి చెందితేనేగాని, పట్టణములు బాగుపడవు. పట్టణముల అభివృద్ధి పల్లెలమీద ఆధారపడి వుంది. అటువంటప్పుడు పల్లెలలోని cottage industries ఎందుకు వృద్ధిచేయకూడదు. అందువల్ల యిప్పుడు యీ యూనివర్సిటీ పెట్టుతున్నారే గాని, తొందరపడి ఏర్పరచవద్దని నా అభిప్రాయము. దీనికి ఒక పెద్ద Expert committee వెయ్యండి. దేశములో వున్న పెద్దలనందరికి పంపించండి. వారి ఉద్దేశ్యాలు సేకరించండి. ఆ తరువాత యూనివర్సిటీని యే విధముగా develop చేసుకోవాలో తెలుసుకో వచ్చు. అంతేగాని, యిప్పుడు యీ ప్రభుత్వము యొక్క విధానము చూస్తే పెద్దకొండను

త్రవ్వితే ఎలుక వచ్చినట్లుగావుంది. అట్లాగే యింత పెద్ద యూనివర్సిటీ పెట్టుతున్నారంటే, ప్రజలకు ఏ విధంగా, ఎంతవరకు ఉపయోగం కలుగుతుందో చూడాలి ప్రభుత్వము వారికి మంచి తెలివిగల లా సెక్రటరీగారు వున్నారు. వారిని ఒక నమూనా తయారుచేసి యివ్వమంటే, ఈ వేళకు 17 నమూనాలను యిచ్చివుండేవారు. ప్రభుత్వం prestiage కొరకు చూస్తున్నదని నా అభిప్రాయము.

అధ్యక్షులవారు బెల్ కొట్టారు. ఇక నా ఉపన్యాసము ఆపవలి కాబట్టి శెలవు తీసుకుంటున్నాను.

Sri G. C. KONDAYYA — ఉపాధ్యక్షా, ఈ ఆంధ్ర దేశమునకు ఆంధ్ర ప్రభుత్వము యేర్పడిన తరువాత, యింకొక క్రొత్త విశ్వవిద్యాలయము వస్తుందనే సంతోషముతో వున్నాము. అసలు యిప్పుడు ముఖ్యముగా University అవసరమేనా అనే విషయము వస్తే, ఆర్థిక దృష్ట్యా అవసరము లేదనే అభిప్రాయముతో నేను మాట్లాడదలచాను. సాధారణంగా గ్రామాలలో వున్న పాఠశాలలో elementary education బాగవాలనే విషయం ప్రభుత్వానికి, సభ్యులందరకూ తెలుసు. ముఖ్యంగా పల్లెలలోవుండే పాఠశాలలకు కుర్చీలు, బల్లలు, భవనాలు మొదలగునవి లేకపోవడం, గ్రామస్థులు యేవైనా భవనాలు యిస్తే schools వుంచటం, లేకపోతే యెత్తివేస్తామనడం జరుగుతోంది. ఈనాడు మన రాష్ట్రంలో elementary education కు ఈగతి పట్టిందని సభ్యులందరికి తెలుసు. నిన్న, మొన్నా District Boards కు funds లేక high schools ను మూసి వేస్తున్నారని adjournment motions వచ్చాయి. ఆ schools కు ధన సహాయము కావలసివస్తే ఆయా జిల్లాబోర్డులు అప్పుల పాలయి వున్నందువల్ల వాటికి డబ్బు యివ్వటంలేదు. జిల్లా బోర్డులు వాటికి డబ్బు యివ్వటంలేదు కనుక వాటిని మూసి వేస్తున్నాము, అని adjournment motions కు బదులుగా ప్రభుత్వము చెబుతున్నారు. ఇట్టి పరిస్థితులలో మన ప్రాథమిక విద్యా విధానము, elementary schools వుంటే, యిప్పుడు రెండవ University ని start చేస్తున్నా మంటున్నారు. అందుచేత ఈ రెండవ విశ్వ విద్యాలయమునకు ఆవశ్యకత యెందుకు కల్గినదో నాకు అర్థము కాలేదు, మా దేశములో యిన్ని పాఠశాలలు వున్నాయి. యిన్ని under - ground railways వున్నాయి. యిన్ని power stations

వున్నాయి. అని statistics చెప్పి కొన్నట్లుగా, మనం కూడా యిన్ని పాఠశాలలు వున్నాయని ప్రకటించు కొనుటకు యీ సంఖ్య వుపయోగిస్తుందిగాని వేరు ప్రయోజనము లేదు. అదే విధంగా మన High Schools వున్నాయి. వాటిలో standard of education గాని కావలసిన buildings, furniture గాని, అవసరమైన staff, డబ్బు కాని వున్నవా ? వాటిని సక్రమంగా నడపుటకు కావలసిన ఆర్థిక స్థోమత వుందా ? వాటిలో కావలసిన విద్యాభివృద్ధి చేసుకొన వలసి వచ్చిన, చేసుకోవచ్చును. ఎవరినో ఉద్ధరించడానికి యీ రెండవ University పెడుతున్నా మనేది హాస్యాస్పదంగా వున్నది. రాయలసీమలో ఖనిజ సంపదను అభివృద్ధిచేయడానికి కళా శాలలను అభివృద్ధి చేయడానికి special courses అవసరమని, వాటికి ఒక ప్రత్యేక University అవసరమని చెబుతున్నారు. ఆ ప్రత్యేకతను దృష్టిలో పెట్టుకొని చూస్తే అది ప్రత్యేకంగా అవసరమైతే, అవసరము కావచ్చు. ఇప్పుడు వున్న సమస్య రాయలసీమకు affiliating University కావలెనా ? Residential University కావాలెనా ? అనేది. అదే వివాద గ్రస్తమైన విషయం. ఈ సమస్యకు వెనుక కులతత్వాలు వున్నవి రాజకీయ దురభిమానాలు, ప్రాంతీయ దురభిమానాలు వున్నవి. ఇవన్నీ పత్రికలలో ప్రకటించ బడుచున్న ప్రకటనల ద్వారా వింటూనే వున్నాము. ప్రత్యేకంగా special courses పెట్టి ఆంధ్ర దేశపు ఖనిజసంపదను అభివృద్ధి చేయుటకు తగిన University కావాలంటున్నారు. మంచిదే. ఆ దృక్పథంతో చూస్తే, తిరుపతి దేవస్థానమునకు వచ్చే డబ్బుకు మన ప్రభుత్వము మరికొంత డబ్బువేసి, ఒక full blown University గా తయారు చేయడానికి బదులు affiliating University అయితే యింత అభివృద్ధి చేసుకొనుటకు వీలవుతుందా ? Affiliating University కాకుండా, ఒక University ని యేర్పాటు చేసుకోవచ్చు. Benares University, Annamalai Unviersity లు affiliating గా కాకుండా అభివృద్ధి చెందాయి. వాటికి యేమిలోపము వుంది ? వాటిలో వుండే లోపమునాకు అర్థం కావడం లేదు.

శ్రీ N. V. L. Narasimha Rao గారు మాట్లాడుతూ, 'బిడ్డ పుట్టక పూర్వమే నామకరణము చేసినట్లు' అనే సామెత చెప్పారు. University లేనిదే, affiliating University యెట్లా అవుతుంది ? standard యెంత ? Certificates ను యెంతవరకు ఆ

University యివ్వగల్గుతోంది? ఈనాడు affiliating University శుద్ధ దండుగ అని, అనవసరమని తెలుస్తున్నది. ఆంధ్ర దేశములో యివ్వేళ విద్యాభివృద్ధి చేయలేని స్థితిలో యూనివర్సిటీ వుంది. ఒక University వున్నప్పుడు దానిని సంపూర్ణం చేయలేనప్పుడు వేరే affiliating University పెట్టి లాభంయేముంది? ముందు దానిని ఆ కాలేజీలతో Affiliating Universety చేయాలనేది ఆలోచించవచ్చు. అంతేకాకుండా, యిప్పుడు రాజకీయ నాయకులు ప్రాంతీయాభిమానాలతో కులతత్వాలను దీనిలో ప్రవేశపెట్టటం దేనికో, యీ ద్వేష భావాలను పూర్తిగా వుపయోగించుకోడం దేనికో, నాకు అర్థం కావటంలేదు. కొద్ది సంవత్సరాలలో మనకు విశాలాంధ్ర వచ్చి తీరుతుంది, దానికి అడ్డం పెట్టడం యెవ్వరికి సాధ్యంకాదు. విశాలాంధ్ర వచ్చినపుడు ఉస్మానియా యూనివర్సిటీ మనకు వస్తుందనుకోవచ్చు. రాదనుకోవడానికి అవకాశము లేదు. ఉస్మానియా యూనివర్సిటీ పెద్ద Universities యొక్క level లో వుంది. మనకు అది తప్పకుండా వచ్చి తీరుతుందని, అప్పుడు మనకు యేవిధమైన కొరత వుండదని నా అభిప్రాయము. అప్పుడు మనం యీ మూడు యూనివర్సిటీల మీద చాలా కోట్ల రూపాయలు ఖర్చుపెట్టవలసి వుంటుంది. మనకు విశాలాంధ్ర 2 3 సంవత్సరాలలో వస్తుందని, హైదరాబాద్ విశాలాంధ్ర సమస్య త్వరలో తేలిపోతుందని నా అభిప్రాయము. ఈనాడు ఆంధ్ర దేశాన్ని రెండు భాగాలుగా చీల్చివేయటం అనవసరమని, అప్రస్తుతమని నేను చెబుతున్నాను. ప్రస్తుతము యీ వివాదములోకి వెళ్ళింది, రాయలసీమాభివృద్ధికి వ్యతిరేకులు. కొంతమంది కులతత్వాలతో కూడిన ద్వేషభావముతో కూడా మాట్లాడారు. వారికి, యీ కులతత్వాలను రెచ్చగొట్టడం, యేవిధమైన ప్రయోజనమునకు పనికివస్తుందో కాని, దీని వల్ల రవంతయైన ఉపకారం జరుగుతుందని నేను అభిప్రాయపడటంలేదు. అందుచేత, యీ బిల్లును Select Committee కి refer చేయవలసిందని, దానిలో వివిధాభిప్రాయములను కూలంకషంగా చర్చించి ఆలోచించి చేసిన, ప్రయోజనం వుంటుందని నేను అభిప్రాయపడుతూ యింతటితో విరమిస్తున్నాను.

Sri N. V. RAMA RAO :—ఉపాధ్యక్షా! మద్రాసు రాష్ట్రము నుంచి ఆంధ్ర రాష్ట్రం విడిపోయిన సందర్భములో శ్రీ బాగ్ ఒడంబడిక

ప్రకారం ఒకవేళ రాయలసీమవారు రాజధాని కోరితే, అది అందరికి అందుబాటులో వుండి, మార్గ సౌకర్యాలు గల తావులో వుండాలని వుంది. సుమారు 6 సంవత్సరాల క్రిందట ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం ఏకగ్రీవంగా తీర్మానించడం కూడా జరిగింది. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన సందర్భంలో ఈ ఏకగ్రీవ నిర్ణయం అమలు జరుగలేదు. తరవాత శ్రీ వాంఛూగారు కూడా రాయలసీమలోనే రాజధానిగాని, హైకోర్టుగాని పెట్టవలసివస్తే దానికి తిరుపతి ప్రాంతమే మంచిదని సూచించారు. తరవాత మద్రాసులో రాయలసీమ M. L. A. లు, డిస్ట్రిక్టు బోర్డు ప్రెసిడెంట్లు, పంచాయితీ బోర్డు ప్రెసిడెంట్లు, మునిసిపల్ అధ్యక్షులు మొదలైనవారు అంతాకూడా సమావేశమై తిరుపతి కావాలని ఏకగ్రీవ నిర్ణయం చేశారు. ఎవరూ కోరని కర్నూలు రాజధాని చేసినా, తిరుపతికి రాజధాని లేకుండా చేసినప్పటికీ, ప్రస్తుతం ఈ యూనివర్సిటీని అయినా తిరుపతికి యిచ్చినందుకు మా పార్టీ తరఫున, తరఫున శ్రీ సంజీవ రెడ్డిగారిని అభినందిస్తున్నాను. ఇలా అభినందించినందుకు కొంతమందికి అనుమానం కలగవచ్చు. విద్యా మంత్రిగారిని, ముఖ్య మంత్రిగారిని అభినందించకుండా వారిని ఎందుకు అభినందిస్తున్నాననే అనుమానం కలగవచ్చు. కాని ముఖ్యమంత్రిగా వున్న శ్రీ పంతులుగారికి, విద్యా మంత్రి శ్రీ పట్టాభి రామారావుగారికి కూడా ప్రస్తుతం శ్రీ సంజీవరెడ్డి గారి అభిప్రాయం కాదని చేయగలిగే శక్తి వారికి లేదని అనుకుంటున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI ;—Sir, this is an insinuation and allegation against the Government. They are trying to divide the Government, which, after all, I am sure, will not succeed.

Sri N. V. RAMA RAO :— నేను ఇప్పుడు ప్రభుత్వాన్ని విడదీయాలనే అభిప్రాయంలో లేను. చినచిన్న చిల్లర విషయాల్లో తప్ప ముఖ్య విషయాలన్నిటికి కీలకం, మూలపురుషుడు శ్రీ సంజీవరెడ్డిగారే, అని ఆంధ్ర దేశంలో అందరూ అనుకుంటున్నారు. కాబట్టి మేముకూడా అనుకుంటున్నాం. అందుచేత దీనిని కాదని శ్రీ పట్టాభి రామారావుగారు ఏమీ చేయలేరు. తిరుపతికి ఈ యూనివర్సిటీని ప్రసాదిస్తున్నందుకు నేను మళ్ళీ ఒకసారి వారిని అభినందిస్తున్నాను. ఈ యూనివర్సిటీ పెట్టినందుకు మేము వ్యతిరేకులం కాదు. కాని ప్రభుత్వము పెట్టబోయే

యూనివర్సిటీ ఏ విధంగా వుండాలి? రెసిడెన్షియల్‌గా వుండాలా, అఫిలియేటింగ్‌గా వుండలా అనేదానిలో భిన్నాభిప్రాయాలు పొడచూపు తున్నాయి కాబట్టి ఇప్పుడు ప్రభుత్వం తెచ్చిన బిల్లు అందరికీ అంగీకారంగా లేదని నిన్న శ్రీ ప్రగడ కోటయ్యగారు చెప్పిన సూచనలతో మేము ఏకీభవిస్తున్నాం. ఎవరు చెప్పినా ఏదో ప్రాంతీయాభిప్రాయంతో చెపుతున్నారని అంటున్నారు. ఈ బేధాభిప్రాయాలను ప్రభుత్వమే తెస్తున్నది. నిజంగా అటువంటి ప్రాంతీయ అభిమానం ఎవరికీ లేదు, వారు చెప్పడంలో, సర్కారువారు మాట్లాడితే ప్రాంతీయ అభిమానముతో మాట్లాడుతారని చెపుతున్నారు అయితే ఏ కల్లూరి సుబ్బారావుగారో, పప్పూరి రామాచార్లుగారో చెప్పితే వారు రాయలసీమకు ద్రోహులు కారు. అదే కమ్యూనిస్టులు చెపితే ద్రోహులుగా కనపడతారు. అదే సర్కార్ వారు చెపితే, రాయలసీమ మీద ద్వేషంతో చెప్తున్నారని చెప్తారు. కాబట్టి యే విధంగా చూచినా ప్రాంతీయ అభిమానం రెచ్చకొట్టే పరిస్థితిని ప్రభుత్వం కల్పిస్తున్నది.

శ్రీ సంజీవరెడ్డిగారు విశాఖపట్నంలో రాజధాని ఉండాలని చెప్పారు. ఆయన రాయలసీమకు పరమమిత్రులు, అదే మేము వేస్తే రాయలసీమకు ద్రోహులం అని చెప్పారు. ఇటువంటి పరిస్థితులు కల్పించకుండా, ఈ ప్రాంతీయ విభేదాలు రాజధాని విషయంలోనే కాకుండా ఇప్పుడు యూనివర్సిటీ విషయంలోకూడా కల్పించడానికి ఈ బిల్లును తీసుకురావడం చాలా శోచనీయం. కాని ఈ యూనివర్సిటీ విషయంలో మాకు ఎంతమాత్రం అభ్యంతరంలేదు. రెసిడెన్షియల్ యూనివర్సిటీగా చేయమని చెప్తున్నాను. రాయలసీమవారికి ఒక యూనివర్సిటీ, సర్కారువారికి ఇంకో యూనివర్సిటీ ఉండడం అన్యాయం. అందులోను నెల్లూరును తీసుకువెళ్ళి వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో కలపడం చాలా అన్యాయం నిన్న శ్రీ వేమారెడ్డిగారు మాట్లాడుతూ రాయలసీమ జిల్లాలకు ఇది చాలాదూరం కాబట్టి మాకు వేరే అఫిలియేటింగ్ యూనివర్సిటీ కావాలని చెప్పారు. కాని వాళ్ళు పరీక్షలకీ వాటికీ ఇక్కడికి రానక్కరలేదు. అక్కడ కూర్చొని pass అవచ్చు. పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సుల విషయంలోమాత్రం ఇక్కడికి రావలసి వస్తుంది. దానికి కొంతడబ్బు ఖర్చౌతుంది. అందుచేతనే తిరపతిలో రెసిడెన్షియల్ యూనివర్సిటీని పెడితే, ఆ కొరత తీరిపోతుంది. అంతమాత్రంచేత ప్రాంతీయ అభిమానాలు ఉన్నాయని అనుకోవద్దు. కాని ఇన్ని

చెప్పినా మేము చెప్పింది వినకుండా మీరు అఫిలియేటింగ్ యూనివర్సిటీ కావాలంటే తీసుకోండి కాని ఒక విషయం చెప్తున్నాను. ఆ యూని వర్సిటీలో నెల్లూరుతో బాటు గుంటూరును కూడా కలుపుకొని, తరవాత ఈ ఆంధ్రా యూనివర్సిటీని వాల్తేర్ యూనివర్సిటీగా చేయాలని చెప్తు న్నాను. ఆంధ్ర దేశంలో ఉన్న సగం కాలేజీలను ఆంధ్ర యూనివర్సి టీకి ఇచ్చి, మిగతా సగం కాలేజీలను తిరుపతి యూనివర్సిటీకి మార్చాలి. అలా చేస్తూ అఫిలియేటింగ్ యూనివర్సిటీగా పెట్టిన దానికి మేము ఒప్పు కుంటాము లేదా చాలాదూరం ఆలోచించి రెసిడెన్షియల్ యూని వర్సిటీగా చేస్తాం అంటే అలా చేయమని మనవిచేస్తూ ఇంతటితో విర మిస్తున్నాను.

Sri P. V. SIVAYYA :—ఉపాధ్యక్షా! శ్రీ వేంకటేశ్వర యూని వర్సిటీనిస్థాపించుటకు పూనుకొన్నందుకు మాత్రం ప్రభుత్వంవారిని అభినం దిస్తున్నాను. అయితే దీనికి తిరుపతి యూనివర్సిటీ అని ప్రత్యేకంగా పేరు చెప్పి, ceded districts లో ఉండే colleges అన్నీ కూడా కలిపి, ఒక affiliating University పెడతా మంటున్నారు. అలాకాకుండా మేము తిరుపతిలో research, teaching అన్నీకలిపి residential University స్థాపించాలని అంటున్నాము. కాని ఈ సందర్భంలో ఒకటి మాత్రం అందరూ కూడా గమనించవలసి ఉంది. తిరుపతి యూనివర్సిటీని affiliating University చేస్తే వచ్చే ప్రత్యేకమైన లాభాలేమిటి ? Residential University గా చేస్తే కలిగే నష్టాలేమిటి ? అన్న విషయాలను గురించి ఆలోచించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఇందాకా పుల్లారెడ్డిగారు మాట్లాడుతూ affiliating వల్ల ప్రత్యేక మైన లాభాలేమైనా ఉన్నాయా ? అని అడిగితే, residential వల్ల, affiliating వల్ల లేని లాభము ఏమైనా ఉన్నదా ? అని ప్రభుత్వ పక్షంవారు ఎదురు ప్రశ్న వేశారు. గోవిందరాజులు నాయుడు, రంగధామారావుగార్ల కమిటీ యిచ్చిన report లో ఉన్న దానిని చూడ మన్నారు. కాని మంత్రిగారు చెప్పిన ఉపన్యాసంలో మాత్రం ఆ కమిటీ యిచ్చిన report ను గురించి, అందున్నటువంటి విషయాలగురించి ఏమీలేదు. గౌరవనీయులైన సభ్యులు చాలమంది

అందులో ఉన్నటువంటి విషయాలను గురించి మాట్లాడారు. ఆ report లో ఉన్న విషయాలకు, మంత్రిగారు చెప్పిన ఉపన్యాసమునకు ఏమీ సంబంధం ఉన్నట్లు కన్పించడంలేదు. ఆంధ్రయూనివర్శిటీ ఇప్పుడు affiliating University గా ఉంది. ఈ ఆంధ్ర యూనివర్శిటీ affiliating గా ఉన్నందువల్ల చాలా లాభాలున్నాయి. ఆంధ్రా యూనివర్శిటీ affiliating గా ఉండి. 11, 12 సంవత్సరములలో అభివృద్ధి పొంది మన హిందూదేశములోని Universities లో ఒక standard ను సంపాదించింది. ఆంధ్రా యూనివర్శిటీ యింకా అభివృద్ధి కావడానికి ఎంతో అవకాశం ఉంది. ఇప్పుడు తిరుపతి యూనివర్సిటీని కనుక affiliating University చేసి రాయలసీమలో ఉండే 10, 12 కాలేజీలను కూడా దానికి affiliate చేసినట్లైతే ఆంధ్రదేశంలో రెండు యూనివర్సిటీలు వస్తాయి. మన ఆంధ్రరాష్ట్రం ఒకటైతే అందులో రెండు యూనివర్సిటీలు ఉంటే educational గా రెండు States ఏర్పడతాయి. అసలు మన ఆంధ్రరాష్ట్రమునకు అంతకూ కలిపి ఒకే affiliating University ఉంటే మంచిది, అసలు రెండు affiliating University లు ఉన్నట్లయితే రెండువిధములైన educational systems వస్తాయి. దానితో ఆంధ్రా యూనివర్సిటీకి యిప్పుడున్న standard తగ్గిపోతుంది. అసలు ఆ Committee వారు submit చేసిన report ను బట్టి చూస్తే ఆ University ని Affiliating University గా చేయడము సరికాదు అని ఉంది. కాని వారు చేసిన recommendation లో మాత్రం అటు affiliating University గాను, residential University గాను, కాకుండా మొత్తానికి రెండూ కలిపి ఉండాలని వుంది. తిరుపతి యూనివర్శిటీని కనుక affiliating University గా చేసినట్లైతే దానికి, ఈ ఆంధ్ర యూనివర్సిటీకి పోటీభావాలు ఏర్పడతాయి. ఇపుడు ఆంధ్ర యూనివర్శిటీ ఒక standard కు వచ్చినది. తిరుపతి యూనివర్శిటీని కనుక affiliating University గా చేసినట్లైతే దీనికున్న standard తగ్గిపోతుంది. ఉద్యోగాలరీత్యా కూడా, పైకి కనపడకపోయినా ఒక భేద భావం ఏర్పడుతుంది. అందువల్ల ఆంధ్ర దేశంలోవున్న 10, 11 జిల్లాల లోను కూడా ఉండవలసింది ఒక్కటే affiliating University అని; వేరొకటి వుండకూడదని కమిటీవారు వారియొక్క రిపోర్టులో సూచించినా

వారు affiliating teaching and residential, ఈ మూడూ కలిపి అక్కడ వుండాలని చెప్పారు. ప్రస్తుతం రాయలసీమలో ఉన్న colleges మద్రాసు యూనివర్శిటీకి అనుబంధంగా ఉన్నాయి. అసలు మద్రాస్ యూనివర్శిటీ ఇండియాలోని మంచి యూనివర్శిటీలలో ఒకటిగా పరిగణింపబడుతున్నది. అలాంటి standard గల యూనివర్శిటీలో ఇప్పుడు ఉన్న రాయలసీమ కాలేజీలతో తిరిగి తిరుపతిలో ఒక కొత్త affiliating Unviersity కనుక ఏర్పాటు చేయబడినట్లైతే యిప్పుడు మద్రాస్ యూనివర్శిటీలో వారికున్న standard, పేరు తగ్గిపోతాయి. ఇప్పుడున్న ఆంధ్రా యూనివర్శిటీకి, ఆ క్రొత్త యూనివర్శిటీకి పోటీ ఏర్పడుతుంది. అసలు యిప్పుడు ఉన్న ఆంధ్రాయూనివర్శిటీయొక్క standard పోతుంది. ఇప్పటికి ఆంధ్రా యూనివర్శిటీని, 11, 12 ఏళ్ళ నుంచి చాలా కష్టపడి, చాలామంది త్యాగంచేసి ఒక standard కు తీసుకువచ్చారు. 10, 12 సంవత్సరాల నుంచి ఈ standard పొందగల్గింది. ఇప్పుడు ఇది భారత దేశంలోని ఒక మంచి విశ్వవిద్యాలయంగా recognise చేయబడింది. మన ఆంధ్ర యూనివర్శిటీలోని M. B. B. S., M. D. Degree లను All India Medical Council వారు recognise చేశారు. ఆంధ్రా యూనివర్శిటీకి అంత standard ఇప్పుడు ఉన్నది. రాయలసీమ కాలేజీలను విడదీసి ఆంధ్రా యూనివర్శిటీలో కలపమని పూర్వం చాలా పెద్ద agitation జరిగింది కాని అప్పుడు అలాగ చేయడం జరగలేదు. మద్రాస్ యూనివర్శిటీకి మొత్తం మన హిందూదేశంలోనే ఒక మంచి standard ఉన్నట్లు recognise చేయబడింది.

అంతటి standard గల మద్రాస్ యూనివర్శిటీ నుంచి బయటకు వచ్చేసి ఒకకొత్త affiliating University తో చేరడం వల్ల వాటికి మద్రాస్ యూనివర్శిటిలో గల standard అంతా పోతుంది. కొత్త యూనివర్శిటీకి ఏ మాత్రం standard వుండదు. ఈ క్రొత్త యూనివర్శిటీతో కలవడంవల్ల వాటికి మద్రాసు యూనివర్శిటీలో వున్నప్పుడు వుండే dignity, standard తగ్గిపోతాయి. అందువల్ల ఈ కాలేజీలు కూడా ఆంధ్రా యూనివర్శిటీతో కలిపితే బాగా వుంటుంది. Andhra University కి మంచి standard వుంది. అందువల్ల Andhra University తో కలిస్తే రాయలసీమ కాలేజీల standard, dignity తగ్గవు. కాని ఒక కొత్త affiliating University పెట్టి

రాయలసీమ కళాశాలలను అందులో చేర్చినట్లైతే standard తగ్గిపోతుంది అందువల్ల వాటిలో చదువుకొనే విద్యార్థులకు చాలా నష్టం కల్గుతుంది. అసలు కొత్త University కి standard అనేది లేకపోవడం వల్ల అది త్వరగా అభివృద్ధిలోకి రావడానికి అవకాశం వుండదు. అందువల్ల కొంచెము standard ఉన్న ఆంధ్రా యూనివర్సిటీలో కనుక ఆ కాలేజీలను కలిపినట్లైతే వాటియొక్క standard తగ్గదు. అంతే కాని రెండు affiliating University లు కనుక మనరాష్ట్రంలో ఉంటే education సరిగా ఉండదు. ఆంధ్రా యూనివర్సటీకి యిప్పుడున్న standard పోతుంది. 10, 12 ఏళ్ళ నుంచి కష్టపడి సంపాదించుకొన్న standard పోతుంది. తరువాత రెండవ సంగతేమిటంటే, నెల్లూరు కాలేజీలను ఈ కొత్త యూనివర్సిటీకి కలుపుకొని affiliate చేయాలని యత్నం జరుగుతున్నదా, లేదా అని ప్రగడ కోటయ్యగారు అడిగారు. ఈ విషయమై ఇదివరలో జరిగిన ఆంధ్రయూనివర్సిటీ సెనేట్ సమావేశమైనప్పడు ఎవరో ఒకరు ముందుగా నోటీస్ యిచ్చి మెమోరాండం రూపంలో తెలియ జేశారు. ఈ విషయం సెనేట్ సమావేశంలో చర్చకు వచ్చింది. అప్పుడు సెనేట్‌కు వచ్చిన నెల్లూరు కాలేజీ Principal గారు వారుఅంతా కూడా నెల్లూరు జిల్లా కాలేజీలు ఆంధ్ర యూనివర్సిటీలోనే ఉంటే తీరుతాయని, ఆంధ్రా యూనివర్శిటీలో పుట్టాము, ఆంధ్ర యూనివర్శిటీలో పెరిగాము, దానితోబాటే పోతాము గాని, అక్కడినుంచి తిరుపతి affiliating University తో మాత్రం చేరేది లేదని, ఆలాగ చేరినట్లైతే నెల్లూరు కాలేజీయొక్క standard పోతుందని చెప్పారు. అందువల్ల నెల్లూరును ఆ కొత్త తిరుపతి University కి కలపడం మంచిది కాదు. అందుచేత ఈ తిరుపతి విశ్వవిద్యాలయాన్ని Residential University గా చేసినట్లైతే బాగుంటుంది. దీనికి ఒక standard వచ్చే దాకా residential University గా పెట్టి ఒక standard వచ్చిన తరువాత దీనినే residential and affiliating University గా చేసుకోవచ్చును. దీనిని చిన్న

residential University గా చేసి 200 ల మంది students ను మాత్రం ఉంచుకొన వచ్చును. వారి వల్ల examination fees 6, 7 వేల రూపాయలు వస్తుంది.

Affiliating University గా చేస్తే, ఈ examination fess దాదాపు 2 లక్షల రూపాయలవరకు వస్తుంది ఇవుడు తిరుపతి యూనివర్సిటీని బహుశః యెక్కువ examination fees కొరకు affiliating University గా చేయడం జరుగుతోంది అనుకుంటున్నాము. అలా కాకుండా ఒకసారే మొట్టమొదట దీనిని affiliating University చేయకుండా residential University చేసి, 200 ల మంది విద్యార్థులతో ప్రారంభించి, దానిని క్రమంగా అభివృద్ధి చేసుకొని ఒక standard కి వచ్చినతరువాత దీనిని affiliating university గా మార్చవచ్చును. మన ఆంధ్రదేశం ఇప్పటికే రాజకీయంగా economic గా, సాంస్కృతికంగా, చీలిపోయింది. దీనిలో యింకా educational గాను, cultural గాను చీలికలు తీసుకువచ్చి, ఆ చీలికలను perpetuale చేయవద్దని ఆంధ్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తూ నేను యింతటితో విరమిస్తున్నాను.

Sri K. ADIKESAVALU NAIDU :— ఉపాధ్యక్షా ! ఈ ప్రభుత్వమైనా యిన్ని రోజులకు తిరుపతి వెంకటేశ్వరుల వరం అధీనంలో వున్నప్పుడు, కమిటీ అధీనంలో వున్నపుడుకూడా ఆశించని యూనివర్సిటీ స్థాపించ దలచుకొన్నందుకు నేను ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. ముత్తంమీద సభ్యులందరూ మాట్లాడినపుడు యిప్పుడు తొందర యేమి వచ్చింది, యీ యూనివర్సిటీని తీసుకువచ్చి అమాంతంగా తిరుపతిమీద వేస్తారేమి అని సంకోచంగా మొదలు పెట్టారు. దీనిలో క్రొత్త యేమీ లేదు. తిరుపతి మహాంతిగారు యిప్పుడున్న ఆయన శ్రీ ప్రయాగ దాస్జీగారు వెంకటేశ్వర ఆలయాధిపతిగా వున్నప్పుడు 25 లక్షల రూపాయలు నేను యిప్పుడు యిస్తాను, ఒక యూనివర్సిటీ పెట్టవలసినది అని అడిగారు. తరువాత కమిటీ ఏర్పడిన తరువాత యూనివర్సిటీ స్థాపిస్తే 25 లక్షలు యిస్తాము అని చెప్పారు. ఈ రోజు రాయల

సీమ కాలేజీల పరిస్థితులు తెలియనివి కావు. Standards గురించి ఎక్కువగా మాట్లాడారు. తిరుపతిలో standard తగ్గిపోతుందని అన్నారు. మదరాసులో ఉన్నప్పుడు రాయలసీమ కాలేజీలు యే standards లో వున్నవో, అవే యే యితర యూనివర్సిటీలలోని కాలేజీలకు తీసిపోవడంలో సందేహం లేదు. క్రొత్తగా యూనివర్సిటీ స్థాపిస్తే రాయలసీమలో standard తగ్గిపోతుందేమోనని చెప్పి అనుకోవడంలో అర్థంలేదు. ఇక affiliated, residential అన్న దాంట్లో అఫిలియేటెడు అనేదే స్పష్టమవుతుంది.

The College students in this area would like to have a University centre in closer proximity to them than Waltair.

> The area from which the University will draw its undergraduates is best under the control of that University for the purpose of determining the entrance standards the University may require.

Another factor which should also be borne in mind is that however successful purely Residential Universities may have been in other countries, their success in ours still remains to be demonstrated. On the other hand, Universities which teach and also affiliate a number of good colleges, have been able to retain their autonomy in practice and function fairly successfully.

ఇంతకు మించి కమిటీ రిపోర్టులో Affiliated University చేయడానికి యేమి ఆధారం కావాలో అర్థంకాకుండా వున్నది. అందుకని నేను మనవి చేసేది యేమిటంటే ఆ వైపునుంచి సభ్యులు చెప్పినట్టు యీ యూనివర్సిటీ కాగితంమీద సృష్టించడం జరుగుతుంది గాని వెంకటేశ్వర యూనివర్సిటీ రెసిడెన్షియల్ అయినట్లయితే ఏమీ ప్రయోజనం వుండదు. Affiliating University అంటే సార్థకం వుంటుంది గాని లేకపోతే ప్రతిపక్ష సభ్యులు చెప్పినట్టు కాగితంమీద సృష్టించడం జరిగి పట్టిబోర్డు యూనివర్శిటీ అవుతుంది. రాయలసీమను separate చేస్తున్నారు అని చెప్పారు. Capital issue లో separatist mentality పుట్టింది రాయలసీమ వారికి

రాయలసీమను యూనివర్సిటీ విషయంలో కూడా education విషయంలో కూడా చీల్చడం ఎందుకు వస్తున్నదో నాకు గోచరం కాకుండా వున్నది. ప్రతిపక్ష నాయకులు ఆంధ్ర యూనివర్సిటీ, మద్రాసు యూనివర్సిటీ వదలి బనారసు యూనివర్సిటీ degree తీసుకున్నప్పటికీ ఆ డిగ్రీ చెల్లుతూనే వున్నది. ఏ యూనివర్సిటీ L. L. B. అయినా - అది బొంబాయి యూనివర్సిటీ Law degree అయినా, కలకత్తా యూనివర్సిటీ Law degree అయినా ఒకే విలువవుంటుంది. ఎంతోమంది practice చేసుకుంటూ వున్నారు. N. V. రామారావుగారిని అభినందించవలసి వున్నది. వారు చెప్పిన సూచనకూడా చాలన్యాయంగానే వున్నది. గుంటూరుకూడా affiliate చేసి పేరు మార్చి దానిని Waltair University అనకూడదా అన్నారు. దానికి నా అభ్యంతరంలేదు. రేపు సెలెక్టు కమిటీవారు Affiliated Unviersity గురించి సరైన నిర్ణయం చేస్తారని ఆశిస్తున్నాను. వెంకటేశ్వర యూనివర్సిటీ కాలేజీల standards రాబోయే Vice-Chancellor మీద ఆధారపడి వుంటాయని, వారు కృషిచేసి మంచి Standards తీసుకవస్తారని, అదృష్టవశాత్తు మంచి కొత్త Vice-Chancellor రాగలరని ఆశిస్తున్నాను. Appointments కోసం చేసే advertisement చూసినట్లయితే degree of any University recognised by Government అని qualifications ల గురించి వ్రాస్తారు. రాయలసీమ యూనివర్సిటీ డిగ్రీవున్నదని వుద్యోగం యివ్వకపోరు. ఈ యూనివర్సిటీని ప్రభుత్వం recognize చేస్తుంది. అన్ని యూనివర్సిటీ డిగ్రీల విలువ దీనికికూడా వస్తుంది. అందుచేత ప్రాంతీయ అభిమానాలను అంటగట్టకుండా యీ బిల్లును సెలెక్టు కమిటీ unanimous గా pass చేస్తుందని ఆశిస్తూ విరమిస్తున్నాను.

Sri. K. VENKIAH :— ఉపాధ్యక్షా! నూతన విశ్వవిద్యాలయం స్థాపించుకోవడం అనేటటువంటిది మన ఆంధ్ర దేశానికి చాల శుభప్రదమైన విషయం. మన అసెంబ్లి ఒక ఐక్యభావంతో దానికి కావలసినటువంటి నిర్మాణాత్మకమైన కొన్ని సూచనలు చేయడానికి సభ్యులకు అవకాశం యిచ్చే పద్ధతిలో మాత్రం యీ బిల్లు ప్రవేశపెట్టబడక పోవడం విచారకరమైన విషయం.

(At this Stage Mr. Speaker occupied the Chair.)

దీనికి కారణం ప్రజలయొక్క మంత్రివర్గానికున్న వైఖరి అని మనవి చేస్తున్నాను. ఈ ప్రత్యేకమైన తిరుపతి యూనివర్శిటీ గురుకుల యూనివర్శిటీగా కావాలని కోరుతున్నాను. ఈ యూనివర్శిటీ జయప్రదం కావడానికి యోగ్యకరమైన courses పెట్టాలి. యూనివర్శిటీ పరిపాలనా పద్ధతులలో పరకమైన మార్పును తీసుకు రావాలి, అని చర్చించడానికి యీ వైపు వారికి అవకాశం యివ్వకుండా బిల్లు తయారుచేసి చర్చకు తేవడం మాత్రం విచారకరమైన విషయం. ఇందుకై వేయబడ్డ కమిటీ తన అభిప్రాయమును స్వేచ్ఛగా యిచ్చినట్లు లేదని యీ కమిటీ రిపోర్టు లోని 8 వ paragraph పూర్తిగా చదివినట్లయితే తెలుస్తుంది. నిజంగా ఒత్తిడి వల్లనే యీ సిఫార్సులను చేసినది అని అవగాహన అవుతుంది ప్రత్యేకంగా గురుకుల Unviersity కంటె affiliated యూనివర్శిటీకే distinct advantages వున్నాయని, ప్రత్యేకమైన ప్రయోజనా లున్నాయని, ఆ కమిటీ రిపోర్టులోని 8 వ paragraph లో చెప్పబడింది

There is no very great merit in dividing the duties of affiliation and external examination between two or more Universities and duplicating the mechanical functions of examinations. A further disadvantage may be that two neighbouring affiliating Universities in a State may vary in standards and this may lead to unhealthy competition.

అది యీ రిపోర్టులో చాల స్పష్టంగా, వివరంగా చెప్పబడింది. అక్కడ వున్నటు వంటి provision కూడా దృష్టిలో పెట్టుకుని యీ విషయం చెప్పబడినది. కాని ఇదే కమిటీ వారు Affiliating Unviersity గానే వుండాలని సిఫార్సు చేసినప్పుడు చెప్పిన కారణాలు పరిశీలించినట్లయితే దాని వుద్దేశము అది కాదని, ఒత్తిడి వల్లనే ఆ విధంగా చెప్పిందని మనకు తెలియడానికి అవకాశం వుంది.

ఇది రాయలసీమ ప్రాంతానికి దగ్గరగా ఉండడమనేది, అక్కడ విద్యార్థులు ఆ ప్రాంతంలో Affiliating University కోరుతూ యున్నారనేది ఒకటి. రెండవది ఆంధ్రాయూనివర్శిటీలో యుండే Research

Honours Courses మొదలైనవి రాయలసీమ ప్రాంతంలో సాగించడము వీలవుతుందని. మూడవది Residential University లు జయప్రదము కావడము లేదనే అనుమానము ఉన్నది. వెనుకపడ్డ ప్రాంతాలలో ఈరకమైన అభిప్రాయం ఉండడం మంచిదికాదు. ఆంధ్ర జాతిని ఐక్యపరచవలసిన బాధ్యత, ఆంధ్రజాతికి పెద్దరికం వహిస్తున్న, పెద్దలమీద ఉన్నప్పటికీ, వారు ఆ బాధ్యత వహించకపోవడం, రాయలసీమలోని కాలేజీలు ఆంధ్రా యూనివర్శిటీకి affiliate చేసేటప్పటికి అక్కడ కాలేజీలమీద వచ్చే డబ్బు ఈ యూనివర్సిటీకి ఉపయోగించాలని చెప్పేటప్పటికి ఈ చట్టానికి అభ్యంతరాలు బైలుదేరినవి. అట్లా కాకుండా రాష్ట్ర ప్రయోజనం ప్రజలకు వివరించి, అది వెనుకబడిన ప్రాంతం అనేది వాస్తవం కాబట్టి ఆంధ్రా యూనివర్శిటీలో ఏ courses తక్కువగా ఉన్నవో, అవి ప్రధానంగా తిరుపతి యూనివర్శిటీలో అభివృద్ధి చేయడం సమంజసం. ఆర్థికంగా అవకాశాలుకూడా ఉన్నవి. అక్కడ యూనివర్శిటీ స్థాపించడంలో ఎవరికీ భేదాభిప్రాయా లక్కఱ లేదు. కాని ఏ ఏ కారణాలు హానికరంగా ఉన్నవో, భవిష్యత్తులో ఆంధ్రదేశంలోని మేధావులు రెండుగా చీలిపోయే ప్రమాదంకూడా ఉన్నదనీ, నిరంతరం కుక్కల కొట్లాటగా ఉంటుందని రిపోర్టులో చెప్పబడింది. దానికి సమాధానం లేదు. ఆంధ్రా యూనివర్శిటీ ఒక అభివృద్ధి దశలోనికి వచ్చిందన్నమాట వాస్తవమే. తిరుపతి యూనివర్శిటీ ఇంకా ప్రారంభమే కాలేదు. ప్రారంభంకాలేదు కనుక మదరాసు యూనివర్శిటీలోనే రెండు సంవత్సరాలపాటు కాలేజీలను ఉండనివ్వాలని వారు సిఫారసు చేశారు. రాయలసీమ కాలేజీలు ఇప్పుడు Madras University కి affiliate ఐన కాలేజీలు అక్కడనే వదలిపెట్టాలని 9 వ paragraph లో సిఫారసు చేయడం జరిగింది. యూనివర్శిటీ ఏర్పర్చడంలో కొన్ని ప్రమాణాలు రూపొందించవలసిన అగత్యం ఉంది. ఆ కాలేజీలలో అటువంటివి సమకూర్చడంవల్ల విద్యార్థులకు అభివృద్ధి ఏమీ ఉండదని చెప్పారు గాని, వాస్తవమైన పరిస్థితులు గమనించలేదు. మదరాసు యూనివర్శిటీలో కొన్ని ప్రమాణాలున్నవి. మన యూనివర్శిటీ కంటె ఎక్కువ అభివృద్ధిలో యున్నవి. అక్కడనుంచి వచ్చినవారికి విజ్ఞానం కల్గచేయాలంటే అంతకన్న ఎక్కువ అభివృద్ధికర పరిస్థితులు

కల్పించవలసియుంటుంది. అటువంటప్పుడు గుంటూరు జిల్లాలోని కాలేజీలు కూడా తిరుపతి యూనివర్శిటీలో కలపాలని సూచనలు వారు కోపం మీద చేశారో ఎల్లాచేశారో గాని రామారావుగారు చెప్పారు. ఎక్కువ కాలేజీలు గుంటూరులో ఉన్నాయి ఆ కాలేజీలు తిరుపతి యూనివర్శిటీలో చేర్చడంవల్ల పంపకం చెయ్యాలనుకున్నారు కాబోలు ఇది చాలా కష్టసాధ్యం, అనవసరమున్నూ. కాలేజీలు మార్చుటకు ఆధారం లేదు. College ల పరిపాలన వేరుగా నేఉంటుంది. ప్రత్యేక అభివృద్ధికి ఎల్లా అవకాశం ఉన్నదీ అక్కడ కనిపెట్టాలి. ఏదో సాకు చూపించి ఆక్షేపించుట తప్ప వారి ఉద్దేశ్యంలో కూడా ఈయూనివర్శిటీ residential గా ఉండాలనే ప్రధానంగా కనిపించుచున్నది. అది వివాదాస్పదంగా చేయకుండా అక్కడక్కడ కాంగ్రెసుపార్టీవారు వాస్తవ పరిస్థితులు గమనించకుండా, V. S క్రిష్ణాగారిని, రంగధామ రావు గారిని తీసుకువచ్చి ఉపన్యాసం ఇప్పిస్తాము, అప్పుడు సందేహాలు తొలగుతాయని ఎట్లా ఆలోచించారో తెలియదు. ఇది జాతి భవిష్యత్తుకు సంబంధించిన విషయం. అందువల్ల మీరు బాగా పరిశీలించాలని విజ్ఞప్తిచేస్తూ Select Committee లో జాగ్రతగా పరిశీలించే ఈ బిల్లు జయప్రదం చేస్తారని ఆసిస్తున్నాను.

Sri D. DASARADHARAMIAH.— అధ్యక్షా! కొద్ది మాసాలక్రిందటనే ఏర్పడిన మన ప్రభుత్వం ఈ రోజున విద్యా విధానంలో అందరకూ మహోన్నతమైన ఆశయాలుకల్గిన, అందరకు అందుబాటులో ఉండగల్గేటటువంటి, చక్కగా ప్రవర్తిల్ల గల్గేటటువంటి ఈ విశ్వవిద్యాలయ బిల్లు ప్రవేశపెట్టినందుకు ప్రభుత్వాన్ని ప్రప్రథమంగా నేను ప్రశంశిస్తూ యున్నాను. తరువాత నిన్న, మొన్నకూడా చాలా మంది మిత్రులు మాట్లాడుతూ దానికి ఉన్న సాధకబాధకాలు చెప్పకుండా చాలా ఉద్రేకపూరితంగానూ, ఈ విద్యావిధానాన్ని రాజకీయాలలోకి ఈడుస్తూ అనేక ప్రసంగాలు చేశారు. అందులో మిత్రుడు ప్రగడ కోటయ్యగారు ఒక ప్రకటన చేశారు. ప్రకటన చేస్తూ ఇది చౌదరీ యూనివర్శిటీ, అదిరెడ్డి యూనివర్శిటీ అని ప్రకటించి ఎవరో అనుకుంటున్నారన్నట్లుగా చెప్పారు. ఇది చౌదరీ యూనివర్శిటీ, అదిరెడ్డియూనివర్శిటీ

కాకపోయినా ప్రగడ కోటయ్యగారిచే చేనేత విశ్వవిద్యాలయాన్ని ప్రవేశ పెట్టే బిల్లు ఈ ప్రభుత్వం తేలేదని, ఆశాభంగం కలిగి అటువంటి అభిప్రాయాలు వెలిబుచ్చారేమో? ప్రభుత్వం అది సానుభూతితో ఆలోచించి వెంటనే చీరాల పేరాలలో చేనేత విశ్వవిద్యాలయం తీసుకు వచ్చేటట్లు ప్రయత్నం చేయుమని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను (నవ్వు). ఆంధ్రాయూనివర్సిటీ Act 1926 లో pass చేశారు. ఆంధ్రాయూనివర్సిటీ ఏర్పడే టప్పటికి, ఆంధ్రదేశంలో అనంతపురంలో, రాజమండ్రీలో, బందరులో, విజయనగరంలో I Grade కాలేజీలు ఉన్నవి, అందులో అనంతపురం, రాజమండ్రి కాలేజీలు గవర్నమెంటు కాలేజీలు. బందరులోని కాలేజి మిషనరీ కాలేజి. విజయనగరం కాలేజి మహారాజావారిది. ఆంధ్రాయూనివర్సిటీ వచ్చిన తరువాత మొత్తం రాష్ట్రంలో ఉండిన కాలేజీలు రెండు సంవత్సరాలపాటు ఈ విశ్వవిద్యాలయంలో ఉన్నవి. ఈ విశ్వవిద్యాలయాన్ని 1928 సంవత్సరంలో Dr. Subbarayan ప్రధాన మంత్రిగా ఉండగా విజయవాడనుంచి వాల్తేరుకు మార్చడం వాల్తేరు వచ్చిన తరువాత C. R రెడ్డిగారు కోటిరెడ్డిగారి అభిప్రాయ ప్రకారం ఆంధ్రాయూనివర్సిటీలో ఉండవలసినదని ప్రయత్నం చేసినా రాయలసీమ మిత్రులు వారికివాల్తేరు దూరం అనీ, ఇతర కష్టాలున్నవనీ వైదొలగి పోవడం జరిగింది. ఈ వైదొలగడం ఎందుకు జరిగింది. అప్పట్లో Senate లో రాయలసీమ కాలేజీలలో Post Garduate Courses ఉన్నత విద్య పెట్టమని వివాదం వచ్చింది. అవి పెట్టుటకు వీలులేదు, యూనివర్సిటీ ఆవరణలో ఉండాలనీ, అవన్నీ మా అధీనంలో ఉండాలనీ C. R. Reddi గారు వాదించి, అటువంటి అవకాశం లేకుండా చేసిన కారణంచేత ఆంధ్రాయూనివర్సిటీనుంచి రాయలసీమ కాలేజీలు మదరాసు యూనివర్సిటీలోకి వెళ్ళినవని నేను అభిప్రాయ పడుతున్నాను. తరువాత అనేక పరిణామాలు చెందినవి. ఈ పరిణామాలకు ఈ యూనివర్సిటీ కాలేజీలను విడదీసుకుని వారు వెళ్ళిపోవడం కారణం అనుకుంటాను. ఇప్పుడు వెంకటేశ్వర యూనివర్సిటీ బిల్లు ప్రవేశపెట్టడంతో ప్రభుత్వంవారు నిపుణుల సలహా తీసుకున్నామనీ, నిపుణులు దాన్ని అనుబంధ విశ్వవిద్యాలయంగా ఉంచడం మంచిదని చెప్పారంటున్నారు. ఇక్కడ గతసంవత్సరం రజతోత్సవం జరిగింది. ఈ విశ్వవిద్యాలయానికి ఈ సందర్భంలో డాక్టరు V. S. క్రిష్ణాగారు సందేశం ఇస్తూ మనకు ఆంధ్రరాష్ట్రం వచ్చింది, వచ్చిన తరువాత ఆంధ్రవిశ్వవిద్యాలయానికి

రజతోత్సవం చేసుకుంటున్నాము. ఈ సంతోష సమయములో త్వరలో రాయలసీమ కళాశాలలు ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు అనుబంధింపబడి సాంస్కృతిక ఐక్యత సాధింపబడుతుంది అని ఆశిస్తున్నానన్నారు. అంటే సాంస్కృతికంగా ఆంధ్రులలో ఐక్యత లేదన్నమాట. ఆరోజున రజతోత్సవ సందర్భంలో Dr. V S. Krishna గారు ఆంధ్రులకు సాంస్కృతిక ఐక్యత లేదనీ, అటువంటిది పెంపొందింప బడకుండా ఉండే అనుబంధ విశ్వవిద్యాలయం ఏ విధంగా కావాలని సలహా ఇచ్చారో నాకు అర్థం కావడంలేదు. కనుక అనేక విధాలైన వాద ప్రతి వాదాలు వచ్చినవి. రాజకీయ దృష్టితో గాని, వాదప్రతివాదాల దృష్టితో గాని ప్రభుత్వం వారు ఆలోచించి ఈ తిరుపతి యూనివర్శిటీని కేవలం Residential లేక Affiliating గా చేసి వివాదం లేకుండా మహోన్నత ఆశయాలు గల్గినటువంటి విద్యకు సంబంధించిన బిల్లును ఈ శాసన సభ ఏకగ్రీవంగా ఆమోదించునట్లు చేస్తారని నమ్ముతూ విరమిస్తున్నాను.

Sri M. SUBBA REDDI — అధ్యక్షా! ఇంతవరకు వెంకటేశ్వర విశ్వవిద్యాలయ స్థాపనకు సంబంధించి జరిగినటువంటి వాదోపవాదాలకు చాలా విచారిస్తూ వున్నాను. పండిత జవహరులాల్ నెహ్రూ గారు ఒకతూరి ఒక యూనివర్సిటీచేత సన్మానింపబడుతూ, సరోజనీదేవి చాన్సలరు హోదాలో సన్మానము జరుపు సందర్భంలో "ఒక మహాకవివై ఈ క్షుద్ర రాజకీయాలకు అతీతముగ వుండి నీ మహా పాండిత్యాన్ని మహా విజ్ఞానాన్ని వెదజల్లినందుకు మిమ్ములను అభినందించుచున్నాను" అని ఆమె చెప్పింది. విద్యకు సంబంధించిన విషయాలలో విద్యా విషయిక సమస్యలపై మన నిర్ణయాలు ఆధారపడి వుండవలెను. ఎక్కడో ఒకచోట University ని నెలకొల్పు సందర్భములో ఆయా ప్రాంతములలో వుండే విజ్ఞానం, సంస్కృతి మొదలైన సమస్యలను అభివృద్ధి చేయుటకు విశ్వ విద్యాలయములు స్థాపించబడవలెను. కాని మరి ఏ ఉద్దేశ్యముతో కాదు. మహాత్మా గాంధి గారు మునుపు మన దేశము అనేక గ్రామములతో కూడుకొన్నదనియు, గ్రామీణ ప్రజల అభివృద్ధికోసం, వాండ్లకు సంబంధించిన రూరల్ విశ్వ

విద్యాలయాలు ఎన్నో నెలకొల్పవలెనని చెప్పారు. అలాంటి సందర్భంలో అనేక ప్రాంతములలో స్వతంత్రపోషకంగా వుండే విజ్ఞానాన్ని పెంపొందించుకొనుటకు ఎందుకు అవాంతరాలు వస్తాయో నాకు అర్థము అగుటలేదు. Residential కాక, Affiliating అంటే అవాంతరాలు లేకుండా వుండదు అని విశ్వసించేవాండ్లలో నేను ఒకడను. శ్రీ రాధాక్రిష్ణన్ గారు వ్రాసిన విషయాలలో విశ్వవిద్యాలయ స్తోమతు efficiency అభివృద్ధి కావలెనంటే decentralization కాక, తక్కువ కాలేజీలు చేరాలని చెప్పారు. Standard తగ్గుతుంది అంటున్నారు. ప్రపంచములో Oxford, Cambridge మొదలైన యూనివర్సిటీలు వున్నవి. ఉదహరణకు Standard తగ్గుతుంది అన్న అభూత కల్పన ఎంతమాత్రం నాకు అర్థం అగుటలేదు. ఇంటర్ యూనివర్శిటీ బోర్డు ఒకటి ఉన్నది, మా నాలుగు జిల్లాలలో అనాదినుండి ప్రత్యేక యూనివర్సిటీ కావలెనను ఆందోళన వెల్లడి అగుచున్నది. బిల్లులో నెల్లూరు జిల్లాను affiliate చేయవలెనని కూడా వుంది. 1906 లో తిరుపతి దేవస్థానము వారు 26 లక్షలు మంజూరు చేస్తామన్నారు. అయితే ఇప్పుడు buildings కు 18½ లక్షలు ఖర్చు అయింది. మిగిలినది యిస్తామంటున్నారు. కేంద్ర ప్రభుత్వం ఆర్థిక శాఖవారు కూడ అదనముగ ఇచ్చుటకు సిద్ధముగ వున్నారు. పత్రికలలో కూడ ఆ విషయాన్ని ప్రకటించారు. అధ్యక్షా! వెంటనే Affiliation అప్పుచేస్తూ తరువాత రెండు సంవత్సరాలకు Affiliating చేయవలెను. ఏలాంటి అవాంతరాలు కలిగించకూడదని చెప్పుతూ విరమిస్తున్నాను.

Sri G. NAGABHUSHANAM :—Mr. Speaker, Sir, the only bone of contention before the House is whether the University should be an affiliating University or a Residential University. On this subject, several members have spoken. Some of the members who spoke from the other side have actually cited authorities, especially sentences from the report, to

support their case. I can show you, Sir several sentences in the same report to support this side. This report is a thorough, elaborate and just one, and the authors have taken a very equitable view both in regard to Residential University and Affiliating University. My friends on the other side actually quoted sentences against having an Affiliating University. They did not read further. If only they had done so, they would have seen two sentences which would have shown them that the authors were against having a Residential University. I shall for the benefit of the House read the relevant portion :

'Another factor which should also be borne in mind is, that however successful purely residential universities may have been in other countries, their success in ours still remains to be demonstrated. Exclusively residential universities have two difficulties to overcome—lack of endowments, limited fee-income and consequent dependence on the State for the bulk of their resources; secondly, lack of well established tradition in the professorial staff for managing their own University. On the other hand universities which teach and also affiliate a number of good colleges have been able to retain their autonomy in practice and function fairly successfully.'

After discussing the merits and demerits of the type of university desirable, the authors of the report have come to the conclusion :

'Our conclusion, therefore, is that the new university should have its seat at Tirupati, it should have teaching and research and it should also affiliate colleges in the Rayalaseema area.

An hon. Member : Read further and see what follows,

Sri G. NAGABHUSHANAM :—I have no objection,

'It may however be noted that for two years to come the examinations of students in affiliated colleges in this area must continue to be conducted by the Madras University.' (Opposition laughter)

That is quite different. Now, Sir, the bone of contention before the House is whether the university should be an affiliating or residential university. Much can be said on both sides. Therefore, I say for our purpose, I want the House to show some consideration for people coming from Anantapur. You have to take our view also in deciding the matter. So, what I say is We are starting the Venkateswara University at Tirupati. Tirupati rightly deserves to be the centre of learning. It is a place of pilgrimage according to Hindu customs and traditions. Now, we have another centre in Rayalaseema a Anantapur. There we have a well developed first grade college. We have only there B.Sc. Mathematics, Physics and Chemistry. We have no M. Sc. Mathematics and research. We have got also an engineering college there. Now by starting the Venkateswara University at Tirupati, we can develop the advancement of science at Anantapur and develop Arts and Philosophy at Tirupati. For an analogy, just see what has happened in Mysore University. Mysore is the centre of humanities, research in philosophy and literature, while Bangalore is made the centre for the development of science, chemistry, geology etc. For this the affiliating university as suggested by the Government is the most practical thing, that also incidental by leads to the develope, ment of Rayalaseema. Therefore, Sir, all those who are opposed to the affiliating university, I submit have not looked into this aspect of the matter.

Another reason advanced against affiliation is that it leads to duplication. What I say is, the Andhra University is well developed. You have got M.Sc course, research work, every thing in technology,

medicine and engineering at Waltair. We want Anantapur to be developed and so let us have advancement of science there. Sri K. Krishna Rao has said that we Rayalaseema people are extreamely poor and we cannot afford to come 500 miles from our place to Waltair. For that very reason, there should be a duplication of university.

There has been attacks on the Congress Party. Several statements have been made by members here, particularly by the member from Nandikotkur that we Congress people have been attempting by this Bill to disrupt Andhra culture and so on. Several such allegations have been made that we are trying to bring disunity among the people. I refute them. They are all false allegations. The Congress Government stands for unity.

Sri V. CHIDANANDAM:— మీరు చెప్పినవి సరిగాలేవు.

Sri G. NAGABHUHSHANAM :—I withdraw my remark if you never meant anything. Sir, I refute the allegations levelled against the Congress Government as baseless. The national policy of the Congress is to establish peace. We want to bring together all the nations and create harmony and concord. We want to end conflict in the world and create world peace. We have created unity in India. Every student of Indian history will know how the Mahrattas, the Sikhs, in their days of power failed to achieve unity in India. Now Congress has achieved in creating unity in India. It has brought India under one flag; it has brought India under one railway; it has brought India under one post office. It has brought about political and economic unity of India. Therefore to suggest that the Congress Government here is trying to disrupt unity is all baseless. Therefore the allegations of our Communist friends that we are trying to disrupt Andhra culture is all baseless. I refute their allegations. Judged by our conduct and

achievement, both at the Centre and in the States, one will see, we have always been fighting for unity and unity alone. Therefore I request my communist friends not to make such baseless statements. Thank you, Sir

Sri T. LAKSHMINARAYANA REDDI — శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం బిల్లును వున్నది వున్నట్లుగా, ఒప్పుకొనే దానికి యిరు పక్షాలకుగూడ అభిప్రాయభేదాలు వున్నట్లున్నది. రాయలసీమ ప్రజలలో రెండు అభిప్రాయాలువున్నట్లు అర్థముఅవుతున్నది. వెంకటేశ్వర University అనుబంధ విశ్వవిద్యాలయంగా వుండాలా? గురుకుల విశ్వవిద్యాలయంగా వుండాలా, అనే దానిలో తీవ్రమైన అభిప్రాయ భేదాలు వున్నాయి దీనిని సెలెక్టు కమిటీకి పంపిస్తున్నాము గాబట్టి - వారు దీనిని గురించి చర్చించటానికి అవకాశం వుంది. ఈ విశ్వవిద్యాలయం, మనకు ప్రత్యేకంగా కావాలని గూడ కోరేపట్ల - రాయలసీమ విద్యార్థులకు, ఆంధ్ర విద్యార్థులకు వారి విజ్ఞానాభి వృద్ధికి ఎంతవరకు తోడ్పడుతుందా అన్న విషయం - సమగ్రంగా ఆలోచించాలి. ఇప్పుడు ఏర్పడే విశ్వవిద్యాలయం, ఆంధ్రయూనివర్శిటీ వలెగాకుండా, క్రొత్త పద్ధతులతో వుండే లాగున చూడాలి. క్రొత్త మార్పులు తీసుకొని రావలసిన అవసరం వుంది ఆంధ్ర విశ్వవిద్యాలయం మాదిరిగానే, ఈ క్రొత్త విశ్వవిద్యాలయం, వున్నందువల్ల ప్రయోజనంలేదు. అనంతపురం కాలేజీలలో ఆనర్సు కోర్సులు పెట్టాలని - ఆంధ్ర విశ్వవిద్యాలయానికి, అను బంధముగా వుంచాలని రాయలసీమ ప్రజలు కోరుతున్నారు.

ఈనాడు ప్రత్యేకంగా ఈ రాయలసీమ కాలేజీలు మద్రాసు యూనివర్శిటీలో ఇంకా కొంతకాలం ఉండడంవల్ల, అక్కడ ఉన్నటువంటి ప్రజల అభివృద్ధికి నిరోధకంగా ఉంటుంది గనుక, వెంటనే ఈ colleges ను ఆంధ్ర విశ్వవిద్యాలయానికి చేర్చవలసిన అవసరమున్నదని మీ దృష్టికి తీసుకొని వస్తున్నాను. ఇవి ఇంకా మద్రాసు విశ్వవిద్యాలయంలో ఉండడంవల్ల ప్రత్యేకంగా ఆ ప్రాంత ప్రజలు పెద్ద ఆందోళన చేస్తున్నారు. ఈ పరిస్థితి ఇట్లానే ఉంటే, ఈ ఆందోళన ఇంకోరకంగా మారవచ్చు. ఈ బిల్లు విషయములో, మన పార్టీ భేదాలు, వ్యక్తిగత భేదాలు ఏ మాత్రము ఉండవలసిన పనిలేదు. అన్ని రాజకీయ పార్టీలు రాయలసీమ ప్రజల సంస్కృతికి, అభివృద్ధికి అన్నివిధాలా తోడ్పడేటట్లు,

ఈ బిల్లును ఒక సక్రియమైనటువంటి విధానములో తీసుకు రావలసిన అవసరమున్నదని మనవిచేస్తున్నాను. తరువాత ఈ యూనివర్శిటీలో Sciences అభివృద్ధి గురించి కొంత చెప్పవలసి యున్నది. ఇతర దేశాలలో మాదిరి కాకుండా, మన పరిశ్రమల గురించి ప్రకృతి గురించి పరిశోధనలు జరిపి, ఆంధ్ర దేశాభివృద్ధిని దృష్టిలో ఉంచుకొని, ఒక శాంతి యుత మార్గమున ప్రపంచాని కంతకు మేలు కలుగచేసేవిధంగా మన శాస్త్రవేత్తలను తయారుచేసే బాధ్యత మన విశ్వవిద్యాలయం మీద ఉన్నది. Atom bomb మాదిరి మానవ అభివృద్ధిని destroy చేసేది కాకుండా, constructive side న పనిచేసే విధంగా తయారు చేయవలసిన అవసరమున్నది. మా అనంతపురములో Engineering college, Technological Institute, లను అభివృద్ధి చేసే అవ కాశాలున్నాయి ఇప్పుడు తిరుపతి Affiliating University చేస్తే, వెంటనే ఇవి అభివృద్ధి చెందుతాయని అనుకోము. కనుక, ఈ తిరుపతి విశ్వవిద్యాలయాన్ని కొంతకాలము develop చేసిన తరువాత ఇవి ఎక్కడ చేర్చవలెనో ఆలోచిస్తాము. ఇప్పుడు తిరుపతి వెంకటేశ్వర విశ్వవిద్యాలయాన్ని Affiliating University గా ఏర్పాటు చేస్తే అనంతపురములో Post-Graduate Courses కు అవకాశముండదు. అనంతపురములో post - graduate courses పెట్టడం చాలా అవసరము. ఈ విషయాలన్నీ కూడా select committee లో సమ గ్రంగా పరిశీలించి, ఈ బిల్లులో సరియైన మార్పులు తీసుకు రావలెనని కోరుతున్నాను. Vice - Chancellor నియామకము గూడా election పద్ధతినే జరిగేటట్లు మార్పుచేయవలెనని కోరుతూ విరమిస్తున్నాను.

Sri R. SIDDANNA GOWD — ప్రజాసోషలిస్టు నాయకు లైన విజయనగరంరాజాసాహెబుగారు మా పార్టీతరఫున ఎంత సమాన వైఖరిని అవలంబించినను, ప్రభుత్వంనుంచి తీవ్రమైన విమర్శలు చేయ బడినవి. ప్రభుత్వపక్షమునుంచి మాట్లాడిన ఉపన్యాసకులలో శ్రీ క్రిష్ణ మూర్తిరావుగారు అపభ్రంశమైనట్టియు, అప్రస్తుతమైనట్టియు ఉపన్యా సము చేశారు. దానిని విమర్శించక విడువ కూడదు. వ్యవధి కొంచెమే అయినప్పటికీ, ఆ విషయము గురించి రెండు నిమిషాలు మాట్లాడి, తరువాత బిల్లు విషయమై మాట్లాడదలచుకొన్నాను. ఇట్టి

శాంతియుతమైనట్టియు, అతి పవిత్రమైనట్టియు, ఆంధ్ర యూనివర్సిటీ ఆవరణలో వారి దృష్టి ఎందువల్లనో హింసాత్మకమైనట్టి ఘట్టము వైపు పారింది. మరి ఒకరు అట్టి ఉపన్యాసము చేసియుండినట్లైతే నేను విమర్శించి యుండను. వారు బాధ్యతగల కాంగ్రెసుపార్టీకి చెరిన నాయకులలో ఒకరు. పోనీ follower అనుకొందాము-అంతేకాకుండా వారు ప్రధానమైన పాత్ర వహిస్తున్నారు. వారు కాంగ్రెసుపార్టీ drummer boy గా కూడా ఉన్నారు (laughter). అందువల్లనే ఇక్కడ ఉపన్యాసము చేయుటకు సాహసించారు. వారు ఉపాధ్యాయుల బృందానికి చేరినట్టివారు కూడ. ఇట్టి ఉపన్యాసములనేనా విద్యార్థులకు వారు భోదించడము ? ఇంక ఆవిషయము మాని బిల్లు విషయమై రెండు మాటలు మాట్లాడతాను. ఈ బిల్లు రాలేదని రాయలసీమ విద్యార్థులు గాని, ఈ శాసనసభ్యులుగాని, ప్రజలుగాని ఏడుస్తున్నారా అని అడుగుతున్నాను. ప్రజలకు ఇబ్బందులు ఎన్నో ఉన్నాయి, హైస్కూళ్ళు మూయబడే స్థితిలో ఉన్నాయి. Elementary పాఠశాలలు మూయబడు తున్నాయి. ప్రజలు ఇంకను క్షామబాధతో పీడింపబడుతున్నారు. ఇంత వెనుకబడిన రాయలసీమలో ముఖ్యంగా కానలసినది ప్రాథమికలు Elementary పాఠశాలలు, హైస్కూళ్ళు, ఆస్పత్రులు మూయబడుచుంటే ఇవన్నీ విడిచిపెట్టి ఒక కొత్త యూనివర్సిటీ స్థాపించడం అంటే ఇది ఒక luxury కాదా అని ప్రశ్నిస్తున్నాను. యూనివర్సిటీ కొత్తగా నెలకొల్పడంవల్ల రాయలసీమకు అభివృద్ధి అభ్యుదయము లేక తృప్తిపరచినట్లవుతుందాఅని ప్రభుత్వాన్ని అడుగుచున్నాను. Education న్ను ఏరీతిగా promote చేస్తున్నారు. ఒక యూనివర్సిటీ ఉంటే చాలదా? అక్కడ చదువుకోడానికి సాధ్యంకాదా అని మరొకసారి ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తున్నాను. ఈ రాయలసీమ కాలేజీలను ఆంధ్రయూనివర్సిటీనుంచి విడదీసి మద్రాసు యూనివర్సిటీకి చేర్చడంచేత గొప్ప తప్పుచేశారు. దానిని సరిదిద్దుకోవడంలో మన ఆంధ్రనాయకులు వెంటనే మద్రాసు యూనివర్సిటీకి చేర్చబడిన కాలేజీలను ఆంధ్రయూనివర్సిటీకి affiliate చేయకుండా, కొత్త యూనివర్సిటీ నెలకొల్పాలని ఏవిధంగా నిశ్చయించుకొన్నారో నాకు అర్థం కావడంలేదు. వారు చేయవలసిన పనుల్లలో ప్రప్రథమముగా, మద్రాసు యూనివర్సిటీకి చేర్చబడిన రాయలసీమ కాలేజీలన్ను ఆంధ్రయూనివర్సిటీకి affiliate చేయవలసియుండును. ఆ

విధముగా దీనికి affiliate చేసిన తరువాత, 6 నెలలో ఒక సంవత్సరమో విడిచిపెట్టి, తరువాత తిరుపతి యూనివర్సిటీని స్థాపించినట్లైతే, వారియొక్క వైఖరి చాలా సమంజసముగా ఉండేది. అప్పుడు వారు అభినందనీయులుగా ఉండెడివారు. అట్లు చేయకుండా ఇంకా ఆ రాయలసీమ కాలేజీలను అట్లే ఉంచివేసి, ఆంధ్రయూనివర్సిటీకి affiliate చేయకుండా, దానికి ఆటంకంగా ఒక కొత్త యూనివర్సిటీని నెలకొల్పాలని ప్రయత్నిస్తున్నారంటే, ఈ ఆంధ్ర దేశములో ఒక territorial barrier కట్టేదానికిని, ప్రాంతీయ విభేదాలను కలుగజేయడానికిని తోడ్పడుతున్నారే తప్ప మరేమియు కాదు అని చెప్పదలచుకొన్నాను. దీనిలో కొంత వ్యక్తిగత అభిప్రాయము ఉంకినప్పటికిని, పార్టీ తరపున మేము ఒక నిశ్చయానికి వచ్చినాము. Residential University గానే ఉండవలసిందని Affiliating University గా ఉండకూడదని మాపార్టీ నిశ్చయించింది. కాబట్టి ఈ తిరుపతి వెంకటేశ్వర విశ్వవిద్యాలయాన్ని Residential University గా చేసినట్లైతే అందరి సమైక్యతకు, విద్యార్థులలో ప్రాంతీయ దురభిమానాలు లేకుండుటకు, దేశము యొక్క ఐక్యతకు దోహదమిస్తుందని, international outlook ఉండేటటువంటి ఈ కాలములో ఈ ప్రాంతీయ దురభిమానాలు, అభిప్రాయ భేదాలు ఉండడం చాలా దురదృష్టమని చెప్పవలసియున్నది. కాబట్టి ఇటువంటివాటికి తావివ్వకుండా దీనిని Residential University గా నెలకొల్పవలెనని కోరుతూ విరమిస్తున్నాను.

Sri K. V. RAMESAM :—Mr. Speaker, Sir, I rise to say a few words on the Bill.

An. hon. Member-Speak in Telugu please.

Sri K. V. RAMESAM:—I prefer to speak in English now, as I have only a few things to say. Sir, we have heard several criticisms on the Bill, in regard to the type of the university the jurisdiction of the university and the constitution of the university and its functions. No doubt the select committee will go into it in detail. Before they do so, I would like to point out two or three points which require serious consideration by the select committee. In regard to the type

of the university, my submission is, it is more or less an urban one. We want a more or less rural type of university That is the opinion expressed by important, eminent educationists like Dr. Radhakrishnan, who has been the Chairman of the University Commission. In this connection it is noteworthy also to note that Mr. Rangayya has unequivocally expressed his views on the subject. I wish the select committee will take into consideration all the views expressed on the subject. They have all come out in a pamphlet, which has been recently published. I appeal to the select committee to take very serious consideration of this aspect of affiliation,

There is also another question which requires serious consideration. In answer to an interpellation, the other day, the Hon Education Minister said that though Oil Technology was started in Ananthpur four or five years back it was very unfortunate that only nine students took advantage of it, and are receiving instruction in it to-day. Why is it so? It is because the area is backward, and so, it is impossible to get students to take to higher education. I suggest this aspect of the matter also should be considered by the select committee. Before the University introduces all the subjects for study, particularly, Physics and other branches of Science, they should take care to see whether any students would be forthcoming to study it. Otherwise the money expended on them would not be spent well. Already for want of finance, our State is not able to start several courses of study. The finance of the new Andhra State is at a very low ebb, and we have to consider whether it is necessary to spend money on so many courses of study. I hope the select committee will consider this question also while considering the type of university to be set up at Tirupati, I am glad the Devasthanam has under-

taken to give 25 lakhs worth of property, and certainly we welcome such future offers.

About the constitution of the university, there is much difference of opinion. I leave it to the select committee to decide. There is keen controversy about it in the House If representation on it is restricted to a few districts, it will lead to disunity. The people of the respective districts of the two Universities will develop a sense of separatism. The students in Andhra University will develop a fealing of alien spirit towards the students of Venkateswara University and vice versa. After forty years of fighting we have achieved the creation of a separate Andhra State, and it is up to us to maintain that unity and not disrupt it. I appeal to the select committee to take all these factors before they finalise the Bill.

Sri S. NARAYANAPPA — అధ్యక్షా, ఈ వెంకటేశ్వర విశ్వవిద్యాలయము స్థాపించే ఉద్దేశ్యముతో ప్రభుత్వము యీనాడు యీ సమావేశములో ఒక బిల్లును ప్రవేశ పెట్టినందుకు నేను అభినందిస్తున్నాను. ఇది వెనుకబడిన ప్రాంతంలో చిరకాలంనుంచి వుండిన విధానాన్ని గమనించి, సభ్యులు విమర్శిస్తున్నప్పటికిని, వారి విమర్శలకు సమాధానాలు చెప్పియుండిన్ని, యిప్పుడు యీ బిల్లు విషయమై మాట్లాడడానికి నాకు యిచ్చిన ఈ అవకాశాన్ని ఉపయోగించుకుంటున్నాను. Andhra University యీ Waltair వచ్చుటకు జమీందార్లు, ధనవంతులు వగైరా ఎంతో కృషిచేశారు. అందుకు వారిని నేను అభినందించ వలసిందే. ఈ University మొట్టమొదట విజయవాడలో స్థాపింపబడి తరువాత యిచ్చుటకు ఏ కారణంగా తరలించబడ్డదిన్ని మనకు తెలుసు. ఇప్పటికి దాదాపు ముప్పది సంవత్సరాలుగా రాయలసీమలోని కళాశాలలకు ఒక విశ్వవిద్యాలయము కావాలని ఆందోళన చేసియుండగా నేటికి యీ ప్రభుత్వంవారు తిరుపతిలో విశ్వవిద్యాలయము స్థాపించపూనుకుంటే, దీనికి అనేక విమర్శలు వెలువడుచున్నవి. రాయలసీమ

చాల వెనుకబడిన ప్రాంతమని అందరికి తెలుసు. దాన్ని ముందుకు తీసుకొని రావాలని అందరము కృషిచేస్తున్నాము. Madras University తో affiliate అయి రాయలసీమ కళాశాలలువుండగా, యిక్కడ గొప్ప మేధావంతుడు అయిన కీ. శే. కట్టమంచి రామలింగారెడ్డిగారు రాయలసీమలో పర్యటనచేసి, ఎన్నో సభలు పెట్టి, అక్కడ వున్న విద్యార్థుల నందరిని కళాశాల లన్నిటిని యీ ఆంధ్ర యూనివర్సిటీలో చేర్చుకోలేక పోయారు. మద్రాసు యూనివర్సిటీనుంచి తప్పించటానికి వారు చేసిన ప్రయత్నాలు యింతఅని చెప్పనలవికాదు. వారి ప్రయత్నాలు అన్ని విఫలమయి పోయినవి. కారణ మేమిటంటే యిక్కడ Waltair లో నిర్మించబడ్డ యీ విశ్వవిద్యాలయము, యిక్కడికి తరలించబడ్డ చరిత్ర అంతయుగూడ సభ్యులకు అందరికి తెలుసుననుకుంటాను. Waltair కు తరలించడముతో రాయలసీమవారికి విద్యాభివృద్ధికి అవకాశాలు లేకుండా పోయినవి. ఈ విశ్వవిద్యాలయ స్థాపన కొరకు కృషిచేసిన విద్యావేత్తలే చెబుతున్నారు. మొదట యీ విశ్వవిద్యాలయము అనంతపురములో ఏర్పాటు చేస్తామని చెప్పిన మాటపోయి, విజయవాడకు తేబడింది. అటుపిమ్మట అక్కడనుంచి యిక్కడ Waltair కు తరలించబడింది. రాయలసీమవారు కడుబీద వారు. Waltair కు రాయలసీమకు ఎంతదూరమున్నదో, విద్యార్థులు ఏ విధంగా యింతదూరమువచ్చి విద్యను అభివృద్ధి చేసుకోగలుగుతారో గమనించాలి. మద్రాసు యూనివర్సిటీలో రాయలసీమ విద్యార్థులకు లభించుచున్న benifits, వారు యిక్కడ తెచ్చుకోలేక పోయారు. అందుచేత యీ విశ్వవిద్యాలయమునుంచి disaffiliate చేయించుకొని రాయలసీమవారికి అందుబాటులో ప్రత్యేక విశ్వవిద్యాలయము ఏర్పడే వరకు Madras University లోనే వుండిపోవటానికి నిశ్చయించుకొని అక్కడనే వుంటూవచ్చారు. ఈనాడు ఒక విశ్వవిద్యాలయము తిరుపతిలో పెట్టుదామని ప్రభుత్వము నిర్ణయిస్తే, దీనికి అనేక విమర్శలు తెస్తున్నారు. రాయలసీమ విద్యార్థుల అభివృద్ధి కోరియేనా, యీ విధంగా విమర్శలుచేయ నారంభిస్తున్నారని అడుగుతున్నాను. రాయలసీమలో వేరే, ప్రత్యేక విశ్వవిద్యాలయము పెట్టితేనే, రాయలసీమ అభివృద్ధి చెందగలదు. మరొక విషయము చెబుతున్నాను. రాయలసీమను University కి Constituency ని చేస్తే, రాయలసీమనుంచి ఒక్కరు అంటే ఒక్కరు కీ. శే. బళ్ళారి రాఘవాచారిగారు సెనేటుకు

ఎన్నికయ్యారు. కాబట్టి ముఖ్యంగా రాయలసీమలోని Colleges అన్నిటిని రాబోవు తిరుపతి విశ్వవిద్యాలయానికి అనుబంధింప చేయాలని మనవిచేస్తున్నాను. ఈ విధంగా ఏర్పాటు చేయడం చాలా సమంజసము. ఈ సభ్యులుచేసే విమర్శలలో ప్రాంతీయ అభిమానాలు, దురభిమానాలు లేవదీస్తున్నారు. వీరుచేసే విమర్శలు రాయలసీమ వారికి కోస్తాజిల్లాల వారికి విభేధాలు కలిగించడానికనే నా అభిప్రాయము. కోస్తాజిల్లా వారుగాని, రాయలసీమవారుగాని, అందరు ఏకీభవించి పనిచేసుకోవలసిన వారము. మన ఐకమత్యమునకు భంగము కలిగించే విమర్శలు చేయవద్దని అంటున్నాను. ఈ విమర్శలలో కులతత్వాలకు తావుకల్పిస్తున్నది. ఈ నాటికైనను రాయలసీమవారు ఒక ప్రత్యేక యూనివర్సిటీ ఏర్పాటు చేస్తామని ప్రభుత్వము అంటూనప్పుడు మన ప్రభుత్వము యొక్క లక్ష్యాన్ని, ఆశయాన్ని ముందుకు తెచ్చే మార్గము చూడాలి. విమర్శలు చేయవద్దని మనవిచేస్తున్నాను. కమ్యూనిస్టు పార్టీవారిలోని కొంతమంది సభ్యులు ముఖ్యంగా పుల్లారెడ్డిగారు, శివరామ రెడ్డిగారు మాట్లాడేది అంతాచూసే యీ విశ్వవిద్యాలయ స్థాపనకు విరోధముగా విమర్శలుచేస్తూ మాట్లాడారు. ఆ పార్టీవారికి నేను ఒకటి మనవిచేయదలచాను. వారి ప్రచారాలలో ప్రజలకు ఎన్నో వాగ్దానాలు చేస్తున్నారు. వారు పార్టీ ప్రణాళికలో రాయలసీమలో విశ్వవిద్యాలయము స్థాపింపచేయటానికి కృషిచేస్తామని వాగ్దానాలు చేశారు.

Sri T. NAGI REDDI — రాయలసీమలో యూనివర్సిటీ ఏర్పాటుకు కృషి చేస్తామన్నామే కాని, Affiliating University కొరకు కృషిచేసి స్థాపింప చేస్తామని మాపార్టీ సభ్యులు ఎన్నడూ ప్రచారము చేస్తూ చెప్పలేదు.

Sri S. NARAYANAPPA:—ఈ నాడు రాయలసీమసభ్యులు యీ సభలోఅల్పసంఖ్యాకులుగా వున్నారు. అందువల్ల రాయలసీమకు ఏవిధంగాను ప్రభుత్వంలో ప్రాతినిధ్యం సంపాదించలేక పోతున్నది. అది వెనుకబడిన ప్రాంతము అయినందున, దీన్ని ముందుకు తెచ్చుటకేందుకు కృషి చేయాలి. రాయలసీమ నుంచి వచ్చిన సభ్యులు యీ తిరుపతి విశ్వవిద్యాలయ స్థాపనకు కావలసి వున్న పరిస్థితులు దృష్టిలో పెట్టుకొంటే, తిరుపతి విశ్వవిద్యాలయము రాయలసీమకు ప్రత్యేకంగా

ఏర్పరుచుకో గలుగుతామని నా అభిప్రాయము. రాయలసీమ విద్యార్థులు యింతవరకు వారికి తగిన facilities లేక వెనుకబడి పోతున్నారు. ఇకనైనా వారు ముందుకువచ్చే సదుపాయము ఆలోచించమని నా విజ్ఞప్తి. ఈ నాడు తిరుపతి విశ్వవిద్యాలయ స్థాపనకుగాను తెచ్చిన బిల్లుకు సహాయ పడతారనిన్నీ, రాజకీయ సమస్యలతో ముడిపెట్టకుండా, రాజధాని, హైకోర్టుకు వచ్చినవిభేదాలు మరచిపోయి, దీన్ని support చేస్తారని ఆశిస్తున్నాను. ఈ బిల్లును ఆమోదిస్తే రాయలసీమకు ఎంతో మేలు కలుగ జేసిన వారగుదురు. ప్రభుత్వము తెచ్చిన బిల్లుకు ఒక సెలెక్టు కమిటీ వేయబడుతుంది. కాబట్టి ఆ కమిటీవారు దీన్ని సమగ్రంగా చర్చించి పరిశీలించి రాయలసీమకు సహాయ పడుతారని ఆశిస్తున్నాను

Sri S. VEMAIAH —అధ్యక్షా, ఇప్పుడు యీ bill చర్చించే సందర్భములో, యిది ఒక చరిత్రాత్మకమైన ఘట్టం అని నేను చెప్తు తున్నాను. ఎందుకంటే యేడుకొండల వానికి యేడుగురు మంత్రులతో కూడిన ప్రభుత్వం వారు నిర్ణయించిన యీ bill నిజంగా చరిత్రాత్మకమైన bill అని తప్పక చెప్పాలి. ప్రస్తుత విద్యా విధానమును గురించి చెప్పాలంటే యిప్పుడు క్రొత్తగా వచ్చిన elementary education scheme, it is a blow to the foundation of education itself ఈనాడు యెన్నో schools మూసి వేయడం జరుగుతోంది.

ఆ తరువాత elementary education నుండి secondary education విషయంలోకి వెళ్ళిన అది అంత అధ్వాన్నంగానూ వుంది. శాసన సభలో ప్రతిరోజూ, Schools మూసి వేయడం గురించి విరామ తీర్మానములు రావటం, మంత్రిగారు వాటిపై కొన్ని కొన్ని వాగ్దానాలు చేయడం జరుగుతోంది. ఈ secondary schools యిట్లా వుండగా, యిక University విషయం ఎట్లా వుంటుందో ఆలోచించాలి. బహుశః నిన్ననో, మొన్ననో Oil Technology లో విద్యార్థులు లేరని విద్యా శాఖా మంత్రిగారు చెప్పడం జరిగింది. విద్యార్థులు లేరని చెబుతూ, తరువాత క్రమేణ 9-మంది విద్యార్థులు వచ్చారు, దానికి లక్షల రూపాయలు ఖర్చు అయిందని చెప్పారు. ఆ Oil Technology వుంది కూడా, అక్కడ Lecturers, Students కు 4 లక్షల రూపా

యులు ఖర్చు అయినదంటే వారు యే tables కు benches కు చెబుతారో యేమోగాని, ఆ విధంగా మనకు ప్రత్యక్ష్యంగా కనబడుతోంది. ఈ bill తీసుకొన్నప్పుడు శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్యగారు ఆంధ్ర ప్రభుత్వమునకు ఒక appeal పంపారు. దానిని దృష్టిలో పెట్టుకొని తగిన మార్పులు తీసుకు రావడానికి ప్రయత్నం అవసరమని, అందుచేత యీ bill ను ఆ విధంగా ఆలోచించ వలసినదని నేను చెబుతున్నాను. ఈ బిల్లులో "The Minister in charge of the portfolio of Education in the State of Andhra shall be the Pro-Chancellor of the University" అని వుంది. ఈ నడుమలో politics విద్యా సంస్థలలో చేర్చబడ కూడదని, యీ మంత్రీగారు Pro-Chancellor గా వుండటం అనేది చూస్తే, రాజకీయాలను యిటువంటి పవిత్ర నిలయాలయిన విద్యా సంస్థలలో ఎందుకు చేర్చకుండా వుండలేరో నాకు అర్థం కాకుండా వుంది. విద్యాశాఖా మంత్రిగారు Pro-Chancellor గా వుండటం వల్ల ఆ విద్యాసంస్థ యెంతవరకు అభివృద్ధి చెందుతుందని నేను ప్రశ్నిస్తున్నాను.

తరువాత Municipal Councils నుండి యెన్నుకోబడ్డవారు, Presidents of Panchayat Boards చేత యెన్నుకోబడ్డ వారికి యీ విద్యా సంస్థలో representation వుండాలని వుంది. ఎంతవరకు వారు విద్యా సంస్థల్లో ప్రాతినిధ్యం వహించ గలరో, వారు యెటువంటి వుపయోగ కరమైన సలహాలు యివ్వగలరో నాకు అర్థము కాదు. ఈ Panchayat Board Presidents, Municipal Councillors విద్యా సంస్థలకు చేయ గల్గేదేమి? అందుచేత డా. రాధాకృష్ణన్ గారి సిఫార్సులను మనస్సులో వుంచుకొని, యీనాడు select committee లో వుండే సభ్యులు తగిన మార్పులు తీసుకు వస్తారని ఆశిస్తున్నాను. ఈ కొద్ది మాటలు చెప్పి నేను యింతటితో విరమిస్తున్నాను.

Sri V. CHIDANANDAM — అధ్యక్షా, నేను యీ bill ను సమర్థిస్తూ ప్రభుత్వము తరఫున యీ Bill ను ప్రవేశపెట్టిన విద్యాశాఖా మంత్రిగారిని అభినందిస్తున్నాను. రాయలసీమ వెనుకబడ్డ ప్రాంతమని, రాయలసీమ జిల్లాలతో బాటు నెల్లూరు జిల్లా కూడ చేర్చబడు

తున్నందులకు నేను మిక్కిలి సంతోషిస్తున్నాను. గుంటూరు కూడ చేర్చి, Tirupathi University అని పేరు పెట్టడానికి నాకు యేలాటి ఆక్షేపణ లేదు. ఆంధ్ర విశ్వ విద్యాలయానికి వాల్తేరు విశ్వ విద్యాలయం అని పేరు పెడితే కూడా అదీ మంచిదే. ఈ campus కు Andhra University అనే పేరు పెట్టివుంచి, అలాంటప్పుడు యీ సమస్యపై చర్చ వచ్చినప్పుడు ఆంధ్రాభ్యుదయాన్ని పాతిపెట్టడానికి వచ్చామని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఆరోపిస్తూ చెప్పారు. ఇలాంటి అశ్లీలమైన వాక్కులు పలుకరాదని మన ధర్మశాస్త్రాలు ఘోషిస్తున్నవి. మనం రాష్ట్రంలో వైజ్ఞానికంగాను, ఆరోగ్యం విషయకంగానూ ప్రతిప్రాంతమును మనము ఏవిధంగా అభివృద్ధి పరచుటకు ప్రణాళికలు పథకాలు వేసి డెవలప్ చేయాలని ప్రయత్నిస్తున్నామో, అదే విధంగా విద్యావిషయములో కూడ ఒక ప్రాంతాభివృద్ధి చేయుటకుగాను విశ్వకళాపరిషత్తును ఏర్పాట్లు చేయవలసి వచ్చినప్పుడు అందుకు తగిన పరిస్థితులను కూడ సమగ్రంగా ఆలోచించవలసినది. కాని ప్రాంతీయాభిమానము, ప్రాంతీయాభిమానము అంటు కొంతమంది సభ్యులు ఆరోపణలు చేశారు. వాస్తవికంగా వాటిని రెచ్చగొట్టిన వారు వారే. పోతే ప్రాంతీయ దురభిమానాలు అని మేము చెప్పలేదు. వారికి మేము జవాబు చెప్పవలసివుంది. Sri B Krishnamurthy Rao గారు ఏదో చెప్పారని ప్రతిపక్షమునుండి Sri C. Pulla Reddy గారు దానికి జవాబుగా నిలబడి చెప్పారు. వారు చెప్పినదంతా ప్రతిపక్ష ధోరణిలో చెప్పారు. Sri Siddanna Gowd గారు చేసిన విమర్శలు తీవ్రంగా ఎందుకు చేశారో తెలియకుండా వుంది. వారు చాలా కోపంగా మాట్లాడారు. మా మిత్రులు Sri N. V. L. Narasimha Rao గారు మాట్లాడుతు సూక్తులు అనేకం వాడారు. యిప్పుడు కోపం పడవలసింది ఏమిలేదు. మన ప్రాంతాలకు అభివృద్ధి చేయాలని లేదా? ప్రతిపక్షంవారు ఆక్షేపణ చేసినట్లు వుద్రేకపూరితమైన వాతావరణంలో పోలీసు బందోబస్తులో ప్రాణాపాయకరమైన శాసనాలు గాక, ప్రశాంత వాతావరణములో ముఖ్యంగా నాయకులందరుకూర్చుని, Select Committee లో అందరు ఒక దారికి రాగల్గితే సంతోషమే. శ్రీ P. V. G. Raju గారు మాట్లాడుతూ పిల్లలేని పెండ్లిమాదిరిగా వుందన్నారు. పిల్లలేని పెండ్లి అనే బదులు పిల్లవాడులేని పెండ్లి అంటే బాగుంటుంది. ఎందుకంటే, ప్రస్తుతం దేశంలో పిల్లలు చాలామందివున్నారు. కూనలేదు, మొదట్లోనే

గ్రుడ్లకు పేరు సోమరాజు అన్నట్లుగా సామెతవుంది. కూనవున్నది. పేరు వున్నది. దానికి వివాహం అయింది. శిశువు పుట్టింది. నామకరణం అయింది. పైగా, యీ పేచీ పెట్టుకొని శాసన సభ్యులు సభలో యీ విధంగా కార్యక్రమం జరుపుకొనడం హాస్యాస్పదం. ఇది సిద్ధాంతాలకు సంబంధించిన విషయం.

పనసకాయ దొరికినప్పుడే తద్దినం పెట్టాలన్నారు. అది మా వైపున లేదనుకోండి. మన శివరామరెడ్డిగారు రాయలసీమవారు Capital కావాలని అనలేదని, చెప్పారు. మా పెద్దలంతా చెప్పిన ఆ సారాంశమే శ్రీ బాగ్ పాక్టు అని చెప్పారు. శ్రీ నరశింహారావుగారు అది పట్టి తెల్లకాగితం అంటారు. (నవ్వు) కాబట్టి Residential and Affiliating University గా ఉండాలని నేను కోరుతున్నాను. ఎందుచేతంటే దానికి ఆదాయం వస్తుంది. ఇతర ప్రాంతాలకు నష్టం కాకుండా, దురభిమానంలేని అభిమానం ఉండవచ్చును. కాబట్టి యిటువంటి యూనివర్శిటీ స్థాపించడానికి అందరూ అనుమతించాలని నా మనవి.

Sri T. NAGI REDDI,—అధ్యక్షా! మనం ఈనాడు చాలా ప్రధానమైన బిల్లును చర్చిస్తున్నాము. ఆంధ్రదేశం సాంస్కృతికంగా అభివృద్ధి కావడానికి ఉపయోగించే ఒక ప్రధానమైన బిల్లును చర్చించే సందర్భంలో ఐక్యతతో కూడినటువంటిన్నీ, అందరికీ అంగీకారయుక్తమైనటువంటిన్నీ, ఆంధ్రదేశ సాంస్కృతికి ఐక్యతకు ముమ్ముందు ఎక్కువ చేయకలిగిన పద్ధతిని ఆలోచించి దీన్ని పాస్ చేయవలసిన బాధ్యత ఈనాడు ఈ శాసనసభా సభ్యులమైన మనమీద ఉంది. అందుచేతనే ఈ బిల్లును యింత ప్రధానమైన బిల్లుగా ఎంచి, సభ్యులందరూ ఈ చర్చలలో పాల్గొని, వివిధరకములైన సలహాలు యిచ్చారు. తిరుపతి విశ్వవిద్యాలయము కావాలనే అభిప్రాయం చాలా రోజులుగా వుందనే విషయం మనం ఇక్కడ తిరిగి చెప్పవలసిన పనిలేదు. దాదాపు అన్ని పార్టీలవారు తిరుపతి వెంకటేశ్వర్లకు డబ్బు చాలా వుందికాబట్టి ఆ డబ్బును ఆంధ్రజాతియొక్క విజ్ఞానాభివృద్ధికి ఉపయోగించడం న్యాయం కాబట్టి మనం ఆ డబ్బును వినియోగించడానికి ఒక విశ్వవిద్యాలయము స్థాపించి దానిద్వారా ఆంధ్రదేశాభివృద్ధికి తోడ్పడవచ్చుననే అభిప్రాయం చాలా రోజులనుంచి ఆంధ్రప్రజలలో వుంది. శ్రీ సండా

నారాయణప్పగారు ఇందాక మాట్లాడుతూ, కమ్యూనిస్టులు దయచేసి ఈ యూనివర్సిటీ బిల్లుకు ద్రోహం చేయవద్దని విజ్ఞప్తి చేశారు. కాని వారు చేసిన విజ్ఞప్తి అనవసరం అవుతుంది. కమ్యూనిస్టులుకూడా ఎన్నో సంవత్సరాలనుంచి తిరుపతిలో ఒక విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయాలని హెచ్చరిస్తూ వచ్చారు. 1946 ఎన్నికల్లోకూడా ఈ విషయము గురించి చెప్పాము. ఎన్నికల ప్రణాళికలోకూడా చేర్చాము. ఇక ఈ విశ్వవిద్యాలయం వుండాలా లేవా అనేదాన్ని గురించి ఇప్పుడు చర్చించ తలుచుకోలేదు. మనకు రెండు విశ్వవిద్యాలయాలే కాదు వీలయినన్ని విశ్వవిద్యాలయాలుకూడా పెట్టుకోవచ్చు. తద్వారా ఆంధ్ర దేశానికే కాదు, హిందూదేశానికే అభివృద్ధికి తోడ్పడుతుందని చెప్పుతున్నాను. ఒక్క తిరుపతిలోనే కాదు, సాధ్యమైనంతవరకు చేయగలిగితే, గుంటూరులో కూడా ఒక విశ్వవిద్యాలయం పెడదాము. మనము U. P. ని తీసుకుంటే, అలహాబాద్‌లో ఒకటి, లక్నోలో ఒకటి, అలీఘర్‌లో ఒకటి వున్నాయి. అలాగే కావలసినన్ని విశ్వవిద్యాలయాలను పెట్టుకోవచ్చు. దానివల్ల మనకు లాభమేగాని, నష్టం ఏమీ వుండదు. ఇక ఈ విశ్వవిద్యాలయానికి సంబంధించిన చర్చలలో అది ఏ విధంగా వుండాలనేది చర్చనీయాంశం. అది గురుకుల విశ్వవిద్యాలయముగా వుండాలా? లేదా, అఫిలియేటింగ్ విశ్వవిద్యాలయంగా వుండలా? అనేది ఒక ప్రశ్న.

ఆంధ్రయూనివర్సిటీ మాకు చాలా దూరంలో ఉంది; అనంతపురంలో ఒక సబ్-యూనివర్సిటీ పెట్టినుంటే మేము అభివృద్ధి చెందేవాళ్ళం, అలా చేయలేదు కాబట్టి మాకు ఒక అఫిలియేటింగ్ యూనివర్సిటీ ఉంటే బాగుంటుందనీ అఫిలియేటింగ్‌గా ఉండాలనేవాళ్లు చెప్పుతున్నారు. కానీ వాళ్ళకు ఒక విషయం చెప్పుతున్నాను. ఆనాడు అనంతపురంలో సబ్ యూనివర్సిటీ పెడతామని చెప్పినా మేము మద్రాసు యూనివర్సిటీ లోనే చేరతాం అన్నవాళ్ళు, శ్రీ రామలింగారెడ్డిగారు రిపోర్టు ఇచ్చిన తరవాత అయినా తిరిగి ఆంధ్రయూనివర్సిటీలో చేరి తద్వారా దేశ అభివృద్ధి సాధించడానికి ఏమాత్రం ప్రయత్నించకపోవడం వల్లగాని, కొన్ని రాజకీయ కారణాలచేత గాని, ప్రతి సందర్భంలోను దేశ ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి ఊతగా ఉన్న ఈ సమస్యను మనం జాగ్రత్తగా ఆలోచించాలి. గత 3 సంవత్సరములలోను రాయలసీమలో

ఉన్న విద్యాలయాలను ఆంధ్రా యూనివర్సిటీలో చేర్చి, అనంతపురంలో ఒక Sub-University పెట్టి, ఈ విధంగా దేశంలో ఉన్న విద్యాసంస్థలను ఐక్యపరచడానికి కమ్యూనిస్టుపార్టీ చేసిన ప్రయత్నం విఫలమైంది. దానిమీద ప్రభుత్వానికి పంపించిన విజ్ఞప్తి విఫలం కావడానికి ప్రధానకారణం ఎవరని నా ప్రశ్న. ఇప్పుడు ఈ బిల్లులోని ప్రధానాంశాల్లో తిరుపతిలో యూనివర్సిటీ అనడమే కాకుండా దానిని అఫిలియేటింగ్ చేయాలని చెప్తున్నారు. ఇది చాలా విచిత్రమైన విషయం. ఒక పొరపాటు చేయటమే తప్పు. అపొరపాటువల్ల వచ్చే ఫలితాలను గురించి తెలుసుకొని కూడా తిరిగి మమ్ములను ఆమార్గాన్నే నడవనివ్వండి అని చెప్పడం సబబుగాలేదు. ఇక అఫిలియేటింగ్ యూనివర్శిటీద్వారా వచ్చిన ప్రత్యేక లాభాలు ఏమిటి? ప్రత్యేక నష్టాలు మీ ముందు పెట్టబోతున్నాను. ప్రత్యేకమైన లాభాలు ఇంతవరకు మీరు చెప్పలేదు. దానివల్ల మాకు డబ్బు వస్తుందనే వక్ర విషయం చెప్పారు, డబ్బుకుగాను అఫిలియేటింగ్ యూనివర్శిటీ పెట్టమని చెప్పడం అంత సమంజసం కాదు. ఆంధ్ర యూనివర్శిటీవల్ల కూడ డబ్బు రాకుండా ఉన్నదని కాదు. అందుకోసమని నెల్లూరులోఉన్న కాలేజీలనుకూడ తీసుకుపోయి దానిలో కలుపుతాం, నెల్లూరు చాలకపోతే గుంటూరుకూడా చేరుద్దాంలే అని చెప్పే సలహాలు చూస్తే ఇది అభివృద్ధికి తగిన కార్యక్రమం కాదనీ, ఈబిల్లు దృష్ట్యా మనకు తెలుస్తోంది. డబ్బు కావలిస్తే దానికి వేరే ప్రణాళికలు వేసుకోవాలి.

(At this Stage the Chairman (Sri G. Nagabhushanam) occupied the Chair.)

"There are distinct advantages in having at suitable centres Universities of the residential and teaching type"

"There is no very great merit in dividing the duties of affiliation and external examination"

"A further disadvantage may be that two neighbouring affiliating Universities in a State may vary in standards and this may lead to unhealthy competition.

And I would like to add it has already come into existence to-day.

"Lack of well-established tradition in the professorial staff for managing their own University".

(At this stage Mr. Speaker resumed the Chair.)

ఇప్పటికే మనలో భేదాభిప్రాయము లున్నాయి. రోజు రోజుకూ మన ఆంధ్ర దేశములో రాయలసీమ, సర్కారు అనేటటువంటి విభేదములు, భేదాభిప్రాయములు పెరుగుతున్నాయి. ఇపుడు తిరుపతిలో పెట్టబోయే శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీని affiliating university గా చేసినట్లైతే, మన ఆంధ్ర దేశములోనే రెండు యూనివర్శిటీలు ఏర్పడి Education కూడా రెండు విధాలుగా ఉంటుంది. ఈ University ని affiliating university గా చేసినందువల్ల ఏమి ప్రయోజనం లేదు సరికదా అనేక నష్టాలు కూడా దీనివల్ల సంభవిస్తాయి. ఇపుడు మన ఆంధ్ర ప్రభుత్వంవారు, Sri Venkateswara University ని Affiliating University గా చేయడం వల్ల వచ్చేనష్టాలు, ఎవరికీ తెలియవు, ఎవరికీ కనపించ నట్టుంటాయి అనుకుంటున్నారు. కాని దీనివల్ల వచ్చే నష్టాలు, ఈ University విషయమై ఏర్పాటు చేయబడిన కమిటీ వారిచ్చిన రిపోర్టును బాగా చదివినట్లైతే అవి కళ్ళకు కట్టినట్లుగా ఉంటాయి అసలు ఈ తిరుపతి వెంకటేశ్వర యూనివర్శిటీని Residential University గా చేసినందువల్ల వచ్చే లాభాలను గురించి Affiliating University గా చేసినందువల్ల కలిగే నష్టం గురించి మనం ఆలోచించాలి. అసలు కమిటీవారు యిచ్చిన report లో Affiliating University చేయడం వల్ల వచ్చే నష్టాలను గురించి వివరించ బడింది. మన ప్రభుత్వము వారు కూడా పైకి Residential University గా చేసినందు వల్ల నష్టాలున్నాయని మాత్రం చెప్తున్నారు. అలాగ పైకి చెప్పినంత మాత్రంచేత దానివల్ల చాలా నష్టములు వస్తాయని అనుకోడానికి వీలులేదని చెప్తున్నాను. అందులో గల లాభనష్టా లేమిటో మనం అంతా ఆలోచించాలి. మనం ఎన్నో Residential Universities చూశాము. Residential University వల్ల చాలా లాభాలున్నాయి. Residential University లో చదువు కొనేటట్లయితే విద్యార్థులకు సౌకర్యములు చాలా ఉంటాయి.

Benares University ఉందంటే అది, Residential University. అచ్చట చదువుదామని చెప్పి దక్షిణదేశం నుంచి ఎంతమందో విద్యార్థులు వెడుతున్నారు. అక్కడ చదవ డానికి వారికెంతో, కుతూహలము కూడా. అక్కడ విద్యా సౌకర్యములు ఎంత బాగుండక పోతే విద్యార్థులు అక్కడికి చదువుకోడానికి వెడతారు?

ఆ Benares University లో Mining Metallurgy, మొదలైన వివిధ విషయములలో బోధన జరుగుతుంది. ఆ Residential University లో అందరూ ఒకేచోట, ఒకే University compond లో కలసిమెలసి ఉంటారు. అసలు Residential University అంటే, ఎక్కడైనా అదేవిధంగా అధ్యాపకులు విద్యార్థులు, అంతా ఒకచోటే ఉంటారు. అలాగ కనుక ఉపాధ్యాయులు విద్యార్థులు ఒకేచోట కలిసి మెలిసి ఉంటే, వారి మధ్యసోదరభావం, సమత్వం, సన్నిహితత్వం ఏర్పడుతాయి, అలాగ కనుక ఉంటే విద్యార్థులు సక్రమంగా చదువుకోడానికి, చాలా విషయాలు తెలుసుకోడానికి, ఉపాధ్యాయులు ఎల్లపుడూ అందు బాటులో ఉంటారు. అలా Residential గా ఉండి చదివినట్లైతే విద్యార్థులకు చాలా విద్యాసౌకర్యాలుంటాయి. Affiliating University అయితే ఈ విధమైనటువంటి సౌకర్యము లుండవు. ఈనాడున్న పరిస్థితులలో Affiliating University లు ఎంతమాత్రం మంచివికావు. Affiliating University కనుక అయితే విద్యార్థులకు, ఉపాధ్యాయులకు మధ్య సన్నిహితత్వం చాలా తక్కువగా ఉంటుందని నేను అభిప్రాయ పడుతున్నాను. రాయలసీమకు తిరుపతిలో యిటువంటి Residential University పెట్టినట్లైతే, మొత్తం రాయలసీమకు అంతకూ మంచివిద్యా సౌకర్యములు కలుగుతాయి. రాయలసీమకు మంచి ఉపయోగ పడుతుంది. ఈ Residential University పెట్టి, అందులో కనుక University లో చెప్పే subjects అన్నీ చెప్తూ ఇంకా ప్రాచీన సాంస్కృతి వేదములు మొదలైనవి అన్నీ నేర్పుతూంటే అది మన ఒక్క ఆంధ్ర దేశానికే కాక, మొత్తం మన హిందూదేశానికి అంతకు కూడా ఉపయోగ పడేటట్లు చేసుకోవచ్చు. కాని దీనిని Affiliating University గా చేసినట్లైతే ఈ విధమైన సౌకర్యము లుండవు సరిగదా ఇప్పుడు ఒక Standard లో ఉన్న ఈ Andhra Uni-

versity కి Sri Venkateswara University కి ఒక విధమైన పోటీ ఏర్పడుతుంది. దానితో ఇప్పుడు ఈ Andhra University కి ఉన్న standard కు దెబ్బతగులు తుంది. ఆంధ్రా యూనివర్శిటీ 10 ఏళ్ళు మామూలు standard లో నుండి, చాలా కృషి చేసి చాలా కష్టంపైన ఒక ఉన్నతాస్థాయికి వచ్చింది. ఇప్పుడు అది మన దేశంలో ఒక recognition, వచ్చి ఒక standard కి వచ్చింది. ముఖ్యంగా ఇప్పుడు ఏ యూనివర్శిటీకి అయినా సరే recognition అనేది ఉండాలి. సాధారణంగా ఆలాగ recognition పొందడానికి తగిన standard కు రావడం చాలాకష్టం. అసలు ఒక Unviersity స్థాపితమైన తరువాత అది recognition పొందడం చాలా కష్టం. ఒక యూనివర్శిటీ స్థాపితమైన తరువాత ప్రప్రధమములోనే recognition రాదు. అసలు ఈ recognition అనేది చాలా కాలం తరువాతవస్తుంది. వస్తే అదిఒక standard, కు reach ఆయింది అన్నమాట. ఇదివరలో మన దేశంలో ఎక్కడైనాసరే ఉద్యోగముల విషయంలో కాని, ఇంక ఏ యితర యూనివర్శిటీలలో సీట్లు విషయంలో కాని, First class వచ్చినప్పటికిని ఆంధ్రదేశం నుంచి, ఆంధ్రా యూనివర్శిటీనుంచి వచ్చిన విద్యార్థికి frist place యివ్వకుండా ఏ యితర కాలేజీనుంచైనా వచ్చినవారికి second class వచ్చినా, సరే అతనికి frist place యిచ్చి, మన ఆంధ్ర దేశంనుంచి వచ్చిన వారికి second place గాని లేక third place గాని యిచ్చేవారు. అప్పుడు యిదంతా ఎందుకు జరిగేదంటే, అప్పుడు మన ఆంధ్రాయూనివర్శిటీకి recognition వచ్చే standard కు రాలేక పోయింది. ఇప్పుడు దేశంలో ఎక్కడైనాసరే మన ఆంధ్రా యూనివర్శిటీనుంచి ఎవరు వెళ్ళినా వారికి first place యిస్తారు. ఎందువల్లనంటే ఇప్పుడు ఆంధ్రా యూనివర్శిటీ ఒక standard కు వచ్చింది. ఇప్పుడు దీనికి ఒక factual recognition వచ్చింది. ఈ University 10 ఏళ్ళనుంచి యిప్పటికి చాలా కృషిచేసి ఈ standard కు రాగలిగింది. శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీని Residential University కాకుండా Affiliating University చేసినట్లైతే మన ఆంధ్ర దేశంలో రెండు Affiliating University లు ఏర్పడితే యిప్పుడు ఆంధ్రా University కి ఉన్న standard దెబ్బతింటుంది. వీటికి మధ్యపోటీ, భేదభావాలు ఏర్పడతాయి. దానితో ఏ యూనివర్శిటీకి కూడా required standard వుండకుండా

పోతుంది. అందువల్ల తిరుపతి శ్రీ వెంకటేశ్వరయూనివర్శిటీని Affiliating University చేస్తే చాలా నష్టదాయకం కనుక దానిని Residential University గా చేసుకువలసిందని చెప్తున్నాను. దానిని Residential University గా చేసి, కొంత కాలానికి బాగా అభివృద్ధి చేస్తే అది మన ఆంధ్ర దేశంలోనే కాక మొత్తం హిందూ దేశంలో కల్లా అత్యంత ప్రాముఖ్యత వహించ గలదు. కొంత కాలానికి recognition వచ్చి, ఆ తరువాత, దానికి ఒక standard వచ్చిన తరువాత, అపుడు కావాలంటే Affiliating University గా చేయడానికి వీలుంటుంది. ఇప్పడు రాయలసీమలోని కాలేజీలు Madras University కి affiliate అయి వున్నాయి. మద్రాస్ యూనివర్శిటీకి ఇప్పడు మంచి standard వుంది. అలాంటి standard ఉన్న యూనివర్శిటీనుంచి బయటికి వచ్చి ఒక క్రొత్త అనుబంధ యూనివర్శిటీలో చేరితే వాటికి ఇదివరకు మద్రాస్ యూనివర్శిటీ కో ఉన్నపుడున్న standard తగ్గి పోతుంది. ఇంకొక క్రొత్త యూనివర్శిటీ ఏర్పడడంవల్ల ఇపుడు ఆంధ్ర యూనివర్శిటీకి ఉన్న standard పోయి మన ఆంధ్ర దేశంలో University చదువు అంత బాగా ఉండదు. Standard ఏమీా బాగుండదు. తిరుపతి శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీని Residential University చేసి దానిని కొన్ని సంవత్సరాలు బాగా అభివృద్ధి చేసినట్లైతే దానికి ఒక recognition వస్తుంది. అపుడు దానిని మిగత రాయుల సీమ కాలేజీలతో కలిపి Affiliating University చేస్తే దాని standard అలాగ నిలబడిపోతుంది. ఒక standard కు వచ్చిన తరువాత కాని recognition రాదు. ఆ విధమైన standard కు వచ్చిన తరువాత కాని recognition రాదనీ ఆ standard రావడానికి చాలా కాలం పడుతుందని, ఈ విషయమే నేను మొన్న అనంతపురంలోని ప్రజలందరికీ చెప్పాను.

తిరుపతి శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీని Affiliating University గా చేసినందువల్ల రాయలసీమ కేమీా లాభం ఉండదు. విద్యాసౌకర్యములు కూడా అంత బాగా ఉండవు సరికదా అనేక నష్టాలు కూడా ఉంటాయి. అలా చేయడం వల్ల బీద విద్యార్థులకు ఏమాత్రం ఉపయోగం ఉండదు. డబ్బున్నవారికే అది బాగా ఉపయోగపడు తుంది. ఆ ప్రాంతంలో ఉన్న middle class వారికి కానివ్వండి, lower class వారికి కానివ్వండి, ఎవరికీ ప్రయోజనముండదు.

తిరుపతి Sri Venkataswara University ని Residential University గా చేసి దానిని అభివృద్ధిచేస్తే అది మన ఆంధ్ర దేశానికంతకూ కూడా ఉపయోగపడుతుంది. ఈ వెంకటేశ్వర యూనివర్శిటీని Affiliating University గా చేస్తే రాయలసీమకు ఏవో లాభాలు కల్గుతాయని అటువైపువారు చేసే argument లు ఏ మంత సక్రమమైనవిగా, సమ్మతమైనవిగా లేవు. ప్రజలను మభ్యపెట్టేవిగా మాత్రమే వున్నాయి. తరువాత నెల్లూరు జిల్లాలోని కాలేజీలను కూడా ఆ యూనివర్శిటీలో affiliate చేస్తాము అంటున్నారు. అలాగ చేసినట్లైతే ఇపుడు ఆంధ్రయూనివర్శిటీలో నెల్లూరు కాలేజీలు ఉన్నందువల్ల వాటికి ఉన్న factual recognition, standard పోతాయి. అటు ఏమాత్రం standard లేని కొత్తయూనివర్సిటీతో కలిపితే అవిఅధోగతి పాలవుతాయి. ఆ కాలేజీలవారికి చాలా నష్టం కల్గుతుంది. అందువల్ల అలాగ చేయడం మంచిపనికాదు. అది అసమ్మతమైనపని అని నేను ప్రభుత్వానికి తెలియజేస్తున్నాను. ఆ విధంగా కొత్త యూనివర్శిటీతో కలపడానికి నెల్లూరు కాలేజీల వారు ఎంతమాత్రం ఒప్పుకునే స్థితిలో లేరు. అలా చేయడం ఏమీ బాగా ఉండదు. Residential University చేసినట్లైతే చాలా లాభాలున్నాయి అందువల్ల Affiliating University వల్ల కలిగే నష్టాలను, Residential University గా చేయడంవల్ల కలిగే లాభాలన్నిటిని గురించి బాగా ఆలోచించవలసిఉందని మరల విజ్ఞప్తి చేస్తున్నాను. అక్కడ Residential Univresity స్థాపించి 10 ఏళ్ళపాటు దానిని సక్రమంగా నడిపి, factual recognition పొందేటట్లు చేస్తే అది వృద్ధిలోకి వస్తుంది. మన దేశానికంతకూ ఉపయోగ పడుతుంది. అందువల్ల బాగా ఆలోచించి అక్కడ Residential University పెట్టి, మిగతా రాయలసీమ కాలేజీలను ఆంధ్రా యూనివర్శిటీతో affiliate చేస్తే వాటి standard వాటికి ఉంటుంది. విద్యాసౌకర్యాలు బాగా ఉంటాయి. అంతేకాని ఆ రాయలసీమ కాలేజీలను కలిపి వెంకటేశ్వర యూనివర్శిటీని Affiliating University గా చేస్తే వాటికి అసలు factual, recognition అనేది రాదు. ఇదివరకున్న dignity standard పోతాయి. అలా చేయడంవల్ల అనేక నష్టాలున్నాయి. అందువల్ల ఈ విషయమై ఆలోచించి ఏదైనా చేయాలని కోరుతున్నాను. అసలు రాయలసీమయొక్క అభివృద్ధికి Residential University అయితేనే ఏమైనా కొంచెం తోడ్పడుతుందేమోనాన్ని

Affiliating University అయితే అంతమాత్రమైనా తోడ్పడు తుందని నేను అనుకోను.

రామలింగారెడ్డి కమిటీ రిపోర్టులోని సలహాలు జ్ఞాపకం చేస్తున్నాను. ఒకసారి తప్పుచేశాము. మద్రాసు యూనివర్శిటీలో వుండి పోయాము. ఆ కారణంచేత విద్యార్థులు వెనుకబడి పోయారు. మద్రాసు యూనివర్సిటీలోనున్న కారణం చేత మనకు నేరే Medical College లేదు. ఆ కారణంచేత Agricultural College లేదు. ఆ నాడు చేసినతప్పు ఫలితం యిన్నేళ్ళూ అనుభవిస్తూవున్నాం. క్రొత్త తప్పులు చేయకూడదు. క్రొత్తగా యూనివర్సిటీ ప్రారంభించడానికి ఆర్థిక పరిస్థితి చూచుకోవాలి. సక్రమమైన పద్ధతులలో యూనివర్సిటీని స్థాపించుకోవాలి. Affiliate చేసినంత మాత్రాన సక్రమమైనదను కోవడం పొరపాటు. ఆంధ్ర యూనివర్సిటీలో మనం అభివృద్ధి చేసుకో డానికి అన్ని అవకాశాలూ వినియోగించు కున్నట్లయితే తప్పకుండా మనం స్థాపించుకోగలం, విద్యార్థుల standards ఏమాత్రం తగ్గించ కుండా అభివృద్ధి చేసుకోడానికి వీలవుతుందని మనం అనుకుంటున్నాం, పోతే యింకో కారణం మనవిచేస్తాను. Exclusive గా Residential University చేయడానికి యింకొక కారణంగా 'Jack of well established tradition in the professorial staff for managing their own University' అని చెప్పారు. దీంట్లో రెండు అర్థాలు వుండవచ్చు, Managing their own University అంటే బహుశః Standards కు సంబంధించి కావచ్చు. లేక తదితర management కు సంబంధించినది కావచ్చు. Management కు అవసరమైన వారిని యూనివర్సిటీ వారు తీసుకోవచ్చు. అన్నామలై యూనివర్సిటీ పెద్ద పెద్ద పెట్టుబడిదారుల సహాయంతో అభివృద్ధి పొందింది. అంతేకాదు. ఆంధ్రా యూనివర్సిటీలో నుంచి కొంతవరకు experience ఉన్న వాళ్ళను తీసుకోడానికి కోరినపుడు ఎవరైనా వద్దని చెబుతారా? అందుచేత యూనివర్సిటీ అభివృద్ధి కోసం Residential University చేసి ఆంధ్ర యూనివర్సిటీలోని experienced people

కావాలని standarads కోసం అడిగితే నిరాకరిస్తారా ?| Colleges చేర్చినంత మాత్రన standard రాదు. ఆంధ్ర యూనివర్సిటీ ప్రారంభించినప్పుడు మద్రాసులోని కాలేజీలు తీసుకున్నాం కదా. Traditions వచ్చేటప్పటికి, standard వచ్చేటప్పటికి 20 సంవత్సరాలు పట్టింది. Affiliating University Create చేసినంత మాత్రాన traditions వస్తాయనీ, standards వస్తాయని, అనుకోవడం చాలా పొరబాటని చెప్పి అనుకుంటున్నాను. ఇకపోతే ప్రభుత్వం యీ బిల్లు తెచ్చేముందు అసెంబ్లీలో నున్నటువంటి వివిధ పార్టీలతో చర్చించి ఏ విధంగా చేయాలో ఆలోచించి వుండినట్లయితే బాగుండేది. అట్టి అవకాశం యిచ్చి ప్రజలలో అనుభవజ్ఞుల అభిప్రాయాలను తీసుకొని వుండినట్లయితే ప్రధానమైన యీ బిల్లు ఏకగ్రీవంగా ఆమోదించ బడడానికి అవకాశం వుండేది. చరిత్రాత్మకమైన యీ బిల్లును వివిధ పార్టీలతో చర్చించి తీసుకువస్తే యీ నాడు యిక్కడ యింతగా చర్చించడానికి అవసరం వచ్చివుండేది కాదు. అయితే ప్రభుత్వం సరైన నిర్ణయాలు తీసుకోలేని వ్యక్తుల నాయకత్వంలో వుండడమే దీనికి కారణం. గతంలో జరిగిన ప్రతి విషయం చూడండి. విశాఖపట్నంలో యూనివర్సిటీ వుంది కాబట్టి కర్నూలులో రాజధాని పెట్టారు, కర్నూలులో రాజధానివుంది కాబట్టి విశాఖపట్నంలో హైకోర్టు పెట్టాలి అన్నారు. విశాఖపట్నంలో యూనివర్సిటీవుంది కాబట్టి తిరుపతిలో affiliating యూనివర్సిటీ పెట్టాలి అన్నారు. తప్పుమీాద తప్పు చేస్తూ, మరొక తప్పు చేయడానికి సిద్ధంగావున్నారు. దీనివల్ల ఆంధ్రులకు అన్యాయం జరుగుతున్నది. రాయలసీమ విద్యార్థులకు అన్యాయం జరిగే పద్ధతిలో మద్రాసులో నున్నపుడు ఆంధ్రరాష్ట్రం కావాలంటే వద్దన్నారు. ఆ విషయం మనం మరచిపోగలమా ?

ఆంధ్ర యూనివర్సిటీలో చేరకపోతే విద్యాభివృద్ధికి నిరోధకం జరుగుతుంది. మద్రాసు యూనివర్సిటీలో వున్నందువల్ల ఐకమత్యం లేకుండా పోయాం. ఆంధ్రదేశానికి అవసరమైన పురోభివృద్ధికి ఆటంకం బయలుదేరింది. ఈ ఆటంకాలు ఆంధ్రదేశ పురోభివృద్ధికి అడ్డుపడతాయని తెలిసికొనిన తరువాత కొనలను పట్టుకొన ప్రయత్నిస్తున్నారు. ఈ కొసవారిని చీల్చడం అనే దృష్టి ఎంత త్వరగాపోతే అంత మంచిదని జ్ఞాపకం చేస్తున్నాను. ఇంకా చర్చించ వలసిన విషయాలు చాలా వున్నాయి.

ముఖ్యమైన విషయం డబ్బుకు సంబంధించినది. ఆంధ్ర యూనివర్సిటీ self-sufficient గా వున్నదనుకోవడం 'building castles in the air' వంటిది. యూనివర్సిటీలు స్వయంపోషకాలు కాజాలవు. అందుచేత ప్రభుత్వ సహాయం ప్రతి యూనివర్సిటీకి అవసరం. దానిని గురించి ప్రత్యేకంగా ఆలోచించవచ్చు. మనం administration కు సంబంధించిన విషయాలు చాలా చర్చించాల్సినవి వున్నవి కాని సెలెక్టు కమిటీలో కూర్చుని జాగ్రత్తగా చర్చించాలి. దానిలో ప్రాతినిధ్యం గురించి ఆలోచించాలి. ఇప్పుడున్న ప్రాతినిధ్యం సరిపోతుందా, సరిపోదా అనే టటువంటి విషయాలన్నీ ఆలోచించాలి. బయటి రాజకీయవేత్తలు సెనేటులోకి రాకూడదు అంటున్నారు. కాని యూనివర్సిటీ రాజకీయాలు చాలా వున్నాయి. నా సెనేటు సభ్యత్వకాలంలో చాల సంగతులు తెలుసుకున్నాను. ఈమధ్య ప్రత్యేకమైన యూనివర్సిటీ రాజకీయాలు బయలు దేరినాయి. యూనివర్సిటీ విద్యాలయాల్లో అదికూడా మనం జాగ్రత్తగా ఆలోచించి administration కు సంబంధించి చేయాల్సిన మార్పులు చేయాలన్నది ప్రధానమైన విషయం. పార్టీల విషయం నేను ప్రస్తావించ దలచుకోలేదు. దానిని క్రిష్ణమూర్తిరావు గారికి యిష్టం వచ్చినపుడు లేనపుడు పార్టీల గురించి మాట్లాడ డానికి విడిచి పెడుతున్నాను. అయినా నేను చెప్ప వలసినది ఒకటి వున్నది. రెండు విశ్వ విద్యాలయాల్లో ఒకటి Residential, ఒకటి Affiliating గా వుండాలి. ఒకదాని కొకటి సంబంధం లేకుండా వుండకూడదు. ఆంధ్ర దేశం అభివృద్ధి చెందడానికి అవసరమైన పద్ధతిలో, అభివృద్ధి చేసుకోడానికి వీలుండే మాదిరి ఆలోచించాలి. University లో fundamental sciences లో కొన్ని రిసెర్చి అవసరమైనవి వున్నాయి. వాటికి సంబంధించినవి develop చేస్తాము. ఆంధ్రదేశపు industrial development కు అవసరమైనట్టి, ఆంధ్ర దేశపు వ్యవసాయానికి అవసరమైనట్టి, భూగర్భ శాస్త్రముకు సంబంధించినట్టి పురాతన సంస్కృతికి సంబంధించి నట్టి courses develop చేయడానికి ఏ విధంగా వాటిని start చేయాలి, యేవిధంగా నడిపించాలి అనే పద్ధతిలో మనంఆలోచించాల్సిన అవుసరం చాలా వున్నది. Duplication of work జరగడానికి వీలులేదు. B. A. కోర్సులో duplication తప్పదు. ఆ తరువాత కొన్ని కొన్ని మార్పులు చేసి coordinating courses పెట్టాల్సిన విషయంలో తగుమైనట్టి చర్యలు తీసుకో వలసిన అవసరం వున్నది అని

చెప్పి అనుకుంటున్నాను. ఈ సూచనను ప్రభుత్వం ముందు, సభ్యుల ముందు పెడుతూ దానిని జాగ్రత్తగా ఆలోచిస్తారని ఆశిస్తున్నాను. కడకు, ముగించే దానికి ముందు, రెండు మాటలు చెప్పాలి. విద్యాలయాలు స్థాపించినంత మాత్రంచేత మన పని అయిపోయింది అనుకోడం పొరపాటు. విద్యాలయాలలోని విద్యవల్ల విద్యార్థులకు నొప్పి కలిగించే విద్య గరపకుండా చూడాలి. కాలేజీవదలి జీవితంలో ప్రవేశించిన తరువాత తాను చదువుకున్న విద్య ఎంతవరకు వుపయోగిస్తుంది అనేది చూడాలి. ఇంత నిరుపయోగమైన విద్య నేర్చుకున్నామేమిటనే నిస్పృహ విద్యార్థుల భావి జీవితంలో కలుగజేసే పరిస్థితులు ఏర్పడకుండా చూడాలి. మన దేశాభివృద్ధికి అనువైన విద్య మనం మన విద్యార్థులకు లభించేటట్టు చూడాలి. జిల్లా headquarters లో లాయర్లు పనిలేకుండా ఎక్కువమంది వుంటే అదే పనిగా ఇంకా ఎక్కువమంది Law graduates ను తయారు చేయడం వల్ల నిరుద్యోగ సమస్య ఎక్కువ అవుతుంది.

ఇప్పుడు మనం జాగ్రతగా ఆలోచించి దేశానికి అవసరమైన పద్ధతిని విద్యాభివృద్ధిచేసే మార్గం ఏదనే విషయం మీద మన దృష్టి కేంద్రీకరించి పని చెయ్యాలని నా అభిప్రాయం. అది చాలా అవసరమైనపద్ధతి. ఏ పద్ధతిలో విద్యాబోధన జరగాలనే విషయం కూడా మనం చూడవలసియుంది. నాకు ఈ రోజు ఒక విద్యార్థిదగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. అతడు ఏమి వ్రాశాడంటే "నేను చదువుకున్నాను. నా చదువుమీద మాతండ్రిగారుచేసిన ఖర్చులవల్ల మేము సతమతమై అవస్థ పడుచున్నాము. ఏదో విశ్వవిద్యాలయం పెడతామంటున్నారే మీరుపెట్టే విశ్వ విద్యాలయం నాలాంటి నిరుద్యోగులను తయారు చేయడానికేనా"? అని ఆరు సంవత్సరముల క్రితం పాసయిన విద్యార్థి రాయలసీమనుంచి ఉత్తరం వ్రాశాడు. మనం విశ్వవిద్యాలయం అభివృద్ధి చేయడంతో పాటు, ఆ విశ్వవిద్యాలయంలో ఉండవలసిన విద్య ఎట్టిది? దేశానికి విద్యార్థులకు అవసరమైన విద్య మనం ఏ రూపంలో ఇవ్వాలనే విషయం జాగ్రతగా ఆలోచించవలసిన విషయం. విద్యాలయాలు స్థాపించడం సులభమే. విద్యాలయాలలో ఏవిధమైన విద్య ఉండాలనే విషయం నిర్ణయించడం కష్టం. చేతులు కడుక్కొని నా పని అయింది, చదువుకుంటే చదువుకుంటారు, చదువుకోకపోతే ఆడుకుంటారు, లేకపోతే నిరుద్యోగులౌతారని అనిపించుకునే విశ్వవిద్యాలయాలను స్థాపించినంతమాత్రమున

చాలదు. ఎటువంటి విశ్వవిద్యాలయాన్ని నిర్మించాలనే బాధ్యత మనమీద ఉన్నది. మనం ఎసెంబ్లీ ఒక sovereign body కాబట్టి అట్టి ప్రధానమైన బాధ్యత మనం స్వీకరించాలి. ఈ బాధ్యత సక్రమంగా నిర్వహించే పద్ధతిలో మనం ఉండాలనీ ఈ విశ్వవిద్యాలయాన్ని residential అనగా గురుకుల విశ్వవిద్యాలయంగా ఏర్పాటుచేసి, ఈ రెండు విశ్వవిద్యాలయాలలో గరపేటటువంటి విద్య co-ordinate చేసి వైరుధ్యం లేకుండా ఉండే పద్ధతిలో ఈ విశ్వవిద్యాలయం స్థాపించి సాంస్కృతికంగా ఆంధ్ర దేశ పురోభివృద్ధికి తోడ్పడతారని ఆశిస్తున్నాను.

The Hon. Sri S. B. P. PATTABHIRAMARAO ;—
అధ్యక్షా ! ఈ విశ్వవిద్యాలయం బిల్లు ప్రవేశపెట్టినది మొదలు ఇంతవఱకూ గౌరవనీయులైన సభ్యులు మిత్రులు ప్రతిపక్షనాయకులతో కలిపి 32 మంది మాట్లాడారు. వారు ఎన్నివిషయాలో చెప్పారు. తలొక విషయంచెప్పారు. చాలాసంతోషింపవలసిన విషయం. సమస్య చాలా పెద్దది. కాలం చాలా తక్కువగా ఉన్నది. ఇంత తక్కువ వ్యవధిలో ఇంత పెద్ద సమస్య తలపెట్టినప్పుడు ఈ విధంగా విమర్శనా పూర్వకంగా వారి స్వంత అభిప్రాయాలు గానో, విద్యావేత్తల అభిప్రాయాలు గానో తెలిపారు. విద్యా మంత్రిగా నేను ఉంటే వచ్చును గాని, నేర్చుకోవలసినది చాలా ఉన్నదని నాకు తెలుసు. అందువల్ల వారు చెప్పిన విషయాలు నాకు ఉపకరించినవి. సావధానంగా విన్నాను. మనసుకు పట్టించుకున్నాను. ఐతే ఒక్కొక్కరూ చెప్పిన విషయాలమీద నాకు తోచిన అభిప్రాయాలు తెలుపవలసినది నా విధ్యుక్తధర్మం. అందువల్ల మనవిచేసుకుంటున్నాను. మొట్టమొదట వావిలాలవారు మనవి చేశారు. వారు మామూలుగా చెప్పే పద్ధతిలో జోరుగా పోయింది బండి. తిరుపతి యూనివర్శిటీని తక్షశిలతో పోల్చడం తప్పన్నారు. నాకు తక్షశిల సమాచారమే తెలియనట్లు చెప్పారు, ఒప్పుకున్నాను. తక్షశిలతో పోల్చతగిన పరిస్థితిలో యున్నామని అనుకోవడంలేదు. తక్షశిల ఆనాడు ఎటువంటి ప్రాతినిధ్యం, ప్రాబల్యం సంపాదించిందో, ఈనాడు ఈ విశ్వవిద్యాలయంకూడా క్రమేపీ అంత మంచిపేరు, అ ప్రచారం

సంపాదించుతుందని ఆశిస్తున్నానని మనవిచేశాను. ఐతే వారు చెప్పింది తక్షశిల residential విశ్వవిద్యాలయంగాని affiliating విశ్వవిద్యాలయం కాదు అని ఆ విధంగా ఇది లేదు కనుక దానితో పోల్చడం తప్పన్నారు కాని residential విశ్వవిద్యాలయం affiliating విశ్వవిద్యాలయం అని ఇన్ని పేర్లు, ఇన్ని పక్షాలూ అప్పుడు తెలియవు. ఏదో గురుకులవాసంగా, గురువు చదువు చెప్పడం శిష్యుడు ముఖాముఖిగా చదువుకోవడం జరిగేది. ఇప్పుడున్న పద్ధతిలో చదువులు, సమ్మేలు చేయడం అప్పుడులేవు. ఆ విశ్వవిద్యాలయంలో ఉండిన మంచిని స్వీకరించమని చెప్పాను. ఈ ఆశయమే నేను వెలిబుచ్చాను. ఆ విశ్వవిద్యాలయాని దీనికీ ఏమి సామ్యం అంటే, కొన్ని ప్రత్యేక విద్యలకు స్థానం ఇచ్చింది తక్షశిల, అటువంటివే కొన్ని పెట్టాలనుకుంటున్నాము.

ఆ విద్యలలో ప్రాబల్యం సంపాదించి, మంచి పేరు సంపాదించి అదేవిధంగా మన హిందూ దేశానికే కాకుండా తూర్పు ఖండానికే పేరు తేవాలని ఆశించాను. ఈనాటికీ ఆ ఆశతోనే ఉన్నాను. ఇది నెరవేరుతుందని నమ్ముతున్నాను. ఇంతటితో తృప్తిపడలేదు. వావిలాలవారు జస్టిసు సదాశివయ్యరును విమర్శించారు. వారితో నేనుఏకీభవింపలేనని మనవిచేస్తున్నాను. జస్టిసుసదాశివయ్యరుగారు ప్రాంతీయ భేధాలు పెట్టాలని తిరుపతిలో విశ్వవిద్యాలయం తలపెట్టారనిఅన్నారు. ఆయన విశ్వవిద్యాలయం బిల్లుతయారుచేసిన మాట వాస్తవమే. Mahant అడ్డుపడకపోతే ఈ విశ్వవిద్యాలయం వచ్చియుండేది. ఆంధ్ర విశ్వ విద్యాలయంతో పాటు అక్కడ కూడా విశ్వ విద్యాలయం ఉండేది. మదరాసు విశ్వ విద్యాలయంతో కలిసి ఇన్ని రోజులు ఇన్ని బాధలు పడేవారు కారు. ఐతే సదాశివయ్యరుగారు వెలిబుచ్చిన అభిప్రాయం మంచిదే. దేవాలయానికి ధనం ఉన్నది. మంచి ప్రదేశం. ముఖ్యంగా సాంస్కృతిక ప్రదేశం. పూర్వ భాషలలోనూ ముఖ్యంగా దేశ భాషలలోనూ వేదాంత సంబంధమైన విద్యలు నేర్చుకొనుటకు వీలైన ప్రదేశమని ఆనాడు వ్రాశారు. ఆనాడు తయారు చేసిన బిల్లు ఈనాటికీ యున్నది. ప్రాంతీయ భేదాలు లేవదీయుటకు వారు ఎన్నడూ సంకల్పించ లేదని మనవి చేస్తున్నాను. తరువాత రాజగోపాల

రావుగారు మొదటినుంచి చివరవరకూ నల్ల అద్దం వేసుకు చూడడం అలవాటు పడినవారవడం వల్ల వారికి అంతా నలుపుగానే కనిపించడం సహజం. దేశాన్ని చీల్చడం, రాజకీయాలు మొదలైన పదాలు ప్రయోగించారు. విశ్వ విద్యాలయం విద్యతో సంబంధించినది. ఐనప్పటికీ ఇది దేశాన్ని చీల్చడం అన్నారు. Residential యూనివర్సిటీ ఉండుటకు అభ్యంతరం లేదన్నారు. Affiliating యూనివర్సిటీకి వారి అభ్యంతరం అని చెప్పారు. వరదాచారిగారు ఆ ప్రాంతంవారు, కొంతకాలం తిరుపతిలో ఉన్నవారు. విశ్వ విద్యాలయం పెంపొందించుటకు వారి సలహా ఉంటుంది. విమర్శచేసి చెప్పారు. వారు ఒకటిమాత్రం చెప్పారు. వీరు ఈ విధంగా విసురుతూంటే వారు ఇంకోవిధంగా విసిరారు. Residential, Affiliating కావాలనే ఉద్దేశ్యం వదలిపెట్టి హెచ్చు స్థాయికి వెళ్ళారు. గుంటూరుకూడ ఇందులో వెయ్యండి అన్నారు. గుంటూరు కలపమనడం కాదు. విశాఖ పట్టణం వఱకూ చేర్చినా, లేక ఇవన్నీ తీసుకువెళ్ళి అందులో చేర్చినా ఒకటే Residential గా ఒకటి affiliating గా ఒకటి అనే అభిప్రాయము కొంతమందికి ఉంటే, రెండూ affiliating గా ఉండాలనే భావం కొంతమందికి ఉంది. రెండూ Affiliating గా ఉంటే కూడా రెండింటికీ ఏమైనా clash ఉంటుందా అనే విషయం సమగ్రంగా ఆలోచించ వలసియుంటుంది.

సీతారామయ్యగారు మాట్లాడుతూ మద్రాసులో Affiliating యూనివర్సిటీ వుంది. అణ్ణామలై Affiliating University కాదు, అణ్ణామలై మద్రాసు యూనివర్సిటీలు ఏ విధముగ ఉన్నాయో ఆ విధముగ వుండవచ్చు అన్నారు. ఇంతవరకు ఐక్య మద్రాసు రాష్ట్రమును తీసుకుంటే మూడు విశ్వ విద్యాలయాలు ఉన్నాయి. ఇప్పడు విడదీసి చెప్పితే మన ఆంధ్ర విశ్వ విద్యాలయం కూడ అందులో చేరి ఉండేది. అణ్ణామలై కేవలం టీచింగు విశ్వవిద్యాలయం. ఆదే రెసిడెన్షియల్ విశ్వ విద్యాలయమంటారు. మద్రాసు విశ్వవిద్యాలయం affiliating విశ్వ విద్యాలయం అందులో టీచింగు చాల తక్కువ. ఆంధ్ర విశ్వ విద్యాలయం రెంటికికూడ తావుచూపింది. Teching, affiliating రెండు కలిసి ఉన్నాయి. మద్రాసు యూనివర్సిటీ కేవలం

affiliating University. అణ్ణామలై కేవలం Residential University. ఇప్పుడు అణ్ణామలై యూనివర్సిటి affiliation కు కొంత area అడగడం నేను ఎరుగుదును. Affiliation ఉంటే బాగా ఉంటుందని వారి కోరిక. ఈ కోరిక అప్పు డప్పుడు వస్తూవుం డేది, తరువాత ఆగి పోయ్యేది. ఆంధ్ర విశ్వ విద్యాలయంలో ఉన్న basic course లను తప్ప మిగిలిన వాటిని split చేశాము. ఇక్కడ టెక్నాలజీ, పరోనాటిక్సు మొదలైనవి పెట్టుకున్నాము. ఒకదానికి ఒకటి complement గ ఉంటుంది. Clash రాదని అనుకొన్నాము. ఈ affiliation వుంటే ప్రాంతీయ విభేదాలు వస్తాయి అన్నారు. దానివల్ల రాదని నా అభిప్రాయం. బొంబాయి రాజధానిలో ధారువారులో విశ్వ విద్యాలయం ఉంది. అచ్చట clash రాలేదు.

Sri T. NAGI REDDI:— బొంబాయి, పూనా, ధారువారు లలో భాషలవారిగా యూనివర్సిటీలు ఉన్నాయని అనుకొంటాను.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO — అలాకాదు. భాషాప్రయుక్త యూనివర్సిటీలు కావు. Area ను బట్టి ఏర్పాటు చేశారు.

రాజగోపాలరావుగారు ప్రతి జిల్లాలోకూడ ఒక టెక్నాలజీ కాలేజి ఉండవలెనని, highly specialised courses వారికి ఉండడం సరికాదన్నారు సెనేటులో ధనికులకు మెంబరు షిప్పు ఇవ్వకూడదన్నారు. వద్దంటే తీసివేయవచ్చును. ఆంధ్ర విశ్వవిద్యాలయంతో నేను 12 ఏడ్లు సంబంధం గలవాడను. ఆ 12 ఏండ్లు ఎంత కష్టపడ్డది నాకు తెలుసును. జమీందారులు ఎందరో సహాయము చేశారు. అయితే అది నాది అని ఆక్ర మించుకొన దలచినవారు ఎవరులేరు. ఉపాధ్యాయులను కొని వేస్తారు అనికూడ చెప్పారు. Vice - Chancellor రామలింగా రెడ్డిగారు రాధాక్రిష్ణన్ గారు, ఇపుడు క్రిష్ణాగారు ఉన్నారు. వాండ్లనుకూడ కొనివేస్తారు, వాండ్లను ఓడించి మరొకరిని గెలిపించవలెనని ప్రయత్నం చేస్తారు అనుకోవడం సబబుకాదు. విద్యాసంస్థలలో అలా జరుగలేదు. ఒకవేళ మీకు అనుమానం ఉంటే నాకు అభ్యంతరంలేదు, మనకు డబ్బు కావలసినప్పుడు

డబ్బు ఇచ్చి అవతలవుంటారా ? అలాంటి వాండ్లు దొరికితే మంచిదే.

Sri T. NAGI REDDI — Those two Vice-Chancellors were too big to be purchased.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO — ప్రతి పక్షంవారు చెప్పేదిసరే, అలాంటి ఉపాధ్యాయులను తీసుకొని రావాలి. వాండ్లుకూడ కొంతధనం తీసుకొని వచ్చుటకు పరిస్థితులు కల్పించవలెను. రాధాకృష్ణన్ గారు ఏ ఏ జమీందారులను పట్టుకొని ధనము సేకరించారో నాకు తెలుసును. M. R. Apparao గారు ఆంధ్ర యూనివర్సిటీలో చేర్చి Residential యూనివర్సిటీ చేయవలెనన్నారు. అందులో నుంచి వచ్చేలాభమును తీసుకొని దీనికి ఇవ్వమని చెప్పారు. ఇందుకు ఆంధ్ర విశ్వవిద్యాలయం అంగీకరిస్తుంది అని నాకు నమ్మకములేదు. C. V. K. రావుగారు మాట్లాడుతూ తిరుపతిలో నీటి సదుపాయములు లేవని, అటువంటిచోట విశ్వవిద్యాలయం ఎలా ఏర్పాటు చేసుకొన్నారని అడిగారు. నీటిసప్లై సదుపాయాలు ఏర్పాటుచేస్తున్నారు. నిన్న మొన్నటి వరకు వాల్తేరులో నీటి కొరకు చాలా బాధపడ్డాము. నీటి సదుపాయములు సరిచేయుటకు ప్రయత్నం చేస్తున్నారు, విజయనగరం రాజాగారు మాట్లాడుతూ, మామూలు పద్ధతిలో "కఱ్ఱ విరుగదు, పాము చావదు" అన్నపద్ధతిలో చెప్పారు. మొదట residential గ ప్రారంభం చేయండి, రెండు సంవత్సరములు అయిన తరువాత affiliating చేయండి అన్నారు. వారు దేనికి కేవలం అనుకూలురో తెలియదు. రెండుగుఱ్ఱముల మీద సవారిచేస్తున్నారు.

ముందు రెసిడెన్షియల్ గా పెట్టి రెండు సంవత్సరములైన తరువాత Affiliating University గా చేయమని, శ్రీ విజయనగరం రాజాగారు చెప్పారు. వారికి దీనిలో వున్న అనుకూలాలు ఏమిటో - నాకు తెలియుటంలేదు. Principles ననుసరించి - చేయటానికి నా కేమీ అభ్యంతరం లేదు. రెసిడెన్షియల్ అయితే - ముందు "టీచింగ్" తో మొదలు పెట్టాలి, దానివల్ల అనేక కష్టాలు వున్నాయి. అంతే గాని,

ఇందులో ప్రాంతీయ దృక్పధాలను లేవదీసేవి గాని, principlesకు against గా వున్నవి గాని ఏమీ లేవని, చెబుతున్నాను. "Imperative" అనిచెప్పిన దానినిగురించి శాస్త్ర విమర్శచేశారు. మదరాసు విశ్వవిద్యాలయమునుండి - రాయలసీమ కాలేజీలను విడదీయాలని చెప్పాను. రాష్ట్రము వచ్చిన తరువాత గూడ మదరాసు విశ్వవిద్యాలయంనుండి, విడదీయకుండా వుండటం న్యాయంగాదని చెప్పతున్నాను. అందులో అంతకంటే, వేరే అర్థము ఏమీలేదు. రెండు సంవత్సరాల తరువాత విశాలాంధ్ర వస్తుంది. అప్పుడు ఇంకో విశ్వవిద్యాలయం, ఎట్లాగూ వస్తుంది గదా - దానితో మూడు విశ్వవిద్యాలయాలు అవుతాయి - అందువల్ల యిది అవసరం లేదని - అన్నారు. రెసిడెన్షియల్ విశ్వవిద్యాలయంగా వున్నా, అప్పుడు అది మూడవ విశ్వవిద్యాలయంగానే అవుతుంది. తెలంగాణాలో ఉస్మానియా విశ్వవిద్యాలయం వుంది. దానికి చాలా వరకు కేంద్రప్రభుత్వమే - సహాయం చేస్తున్నది. అందువల్ల అది రాష్ట్రప్రభుత్వానికి సంబంధించేదిగా వుంటుందని అనుకోను. ఐనా, area పెద్దదైనకొద్దీ - విశ్వవిద్యాలయాలు ఎన్నివున్నా బాధలేదు. విశ్వవిద్యాలయాలు పెరిగితే, దేశము యొక్క పెరుగుదలను తెలియచేస్తుంది. ఇందు వల్ల, ప్రజలకు విద్యాభివృద్ధిని కలుగజేస్తుంది. కాబట్టి విశ్వ విద్యాలయాలు పెరిగినందువల్ల నష్టములేదు. ఏదో విధంగా, ఇవి పెరగటం మంచిదే. శ్రీ పుండరీకాక్షాచార్యులుగారు నెల్లూరు ఎందుకు కలిపారు అని అన్నారు. ఎందుకంటే, తిరుపతికి నెల్లూరు దగ్గరగా వున్నది గనుక ఆ ప్రదేశములో వున్న కాలేజీల నన్నింటినీ కలిపాము. ఇది లాభంగా వుంటుందనే అట్లా చేశాము. వాల్తేరు అయితే చాలా దూరముగా వున్నదనీ ఇందువల్ల చాలా నష్టముగా వుంటుందనీ అక్కడైతే బాగుంటుందనే వుద్దేశ్యంతో - నెల్లూరు కలిపాము. అంతేగాని రాయల సీమను ప్రత్యేకించి ప్రాంతీయంగా విడదీయాలనే అభిప్రాయం లేదని తెలుపుతున్నాను. రెండు విశ్వవిద్యాలయాలు ఏర్పాటు చేయాలని అనుకున్నాము. ఒకటి - వాల్తేరులో - రెండవది తిరుపతిలో. ఈ రెండు విశ్వవిద్యాలయాలు - ఆంధ్ర రాష్ట్రమునకు సంబంధించినవే. ఇందువల్ల ఆ యా ప్రాంతీయ

లకు - ఎక్కువ సేవచేయడానికి వీలు అవుతుంది. రాష్ట్రము మొత్తంమీద విద్యార్థులు ఎక్కడికైనా పోయి చదువుకోడానికి వీలుగా వుంటుంది. రాయల సీమ విద్యార్థులు విశాఖపట్నం రాలేక మద్రాసు విద్యాలయమునకు పోవటం జరుగుతున్నది. ఆ యిబ్బందిని తొలగించడానికి అక్కడ యింకో విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయటం జరిగిందేగాని ఇందులో వేరే అభిప్రాయం లేదని మనవి చేస్తున్నాను. శ్రీ శివరామరెడ్డిగారు ప్రసంగిస్తూ ఒకే రాష్ట్రములో రెండు "అఫిలియేటింగ్" యూనివర్శిటీలు ఎక్కడా లేవని చెప్పారు. ఒక చోట వుందని చెప్పాను. బొంబాయి రాష్ట్రములో రెండు "అఫిలియేటింగ్" విశ్వవిద్యాలయాలు వున్నాయని చెప్పాను. వైస్‌ఛాన్సలర్ గారి powers విషయమై చాలా మంది చెప్పారు. వైస్‌ఛాన్సలర్‌ను, ఎలక్షన్ ద్వారా తీసుకోవటం జరుగుతున్నది. మార్పులు కావాలంటే Select కమిటీ కూర్చుని (విశ్వవిద్యాలయ అభివృద్ధిని మనస్సులో పెట్టుకొని) మార్పులు చేసుకోవచ్చును. వైస్ ఛాన్సలర్‌ను డైరెక్టుగా appoint చేయాలని చెప్పారు. మా అభిప్రాయాలు బిల్లులో చెప్పాము. అవి కూడ మార్చుకోవాలంటే మార్చుకోవచ్చును. ఇంతవరకు ఆంధ్రవిశ్వవిద్యాలయం సరియైన విద్యావేత్తలనే ఎన్నుకుంటూ వస్తున్నది.

శ్రీ N. V. L. నరశింహారావుగారు మాట్లాడుతూ క్రొత్త పద్ధతులంటూ పాతపద్ధతిగానే మాట్లాడినారు. తిరుపతి కొండపైనా, కొండ క్రింద ఒక్కటే అన్నారు. నేను కొండపైకి సేవ కొరకు వెళ్ళతాను, కొండక్రింద-విశ్వవిద్యాలయం సేవచేస్తాను. వారు పాతపద్ధతులలో చదువుకున్నారు గనుక వారికి అట్లా కనిపిస్తుంది. బౌద్ధులను గురించి, తక్షశిల వాటిని గురించి చెప్పారు. నవీన పద్ధతులలో ఈ విశ్వవిద్యాలయం నడవటానికి ఏలాంటి అడ్డంకులు వుండరాదని నా అభిప్రాయం. ఈ విశ్వవిద్యాలయం హిందూ దేశములో వున్న అన్ని విశ్వవిద్యాలయాలకంటే ప్రథమ స్థానంలో వుండే లాగున చేయాలని నా ఆశ. అందుకనే యీ విశ్వవిద్యాలయమును సృష్టించటములో సంస్కృతికి హెచ్చు ప్రాధాన్యం యిస్తూ చారిత్రక విషయాలు కూడ ప్రత్యేకంగా ఏర్పాటుచేశాము. ఆంధ్రయూనివర్శిటీలోని విద్యార్థులు ఏలాంటి

విద్యావంతులుగా తయారవుచున్నారో నాకు తెలుసును. వాళ్లను చూసి మనం గర్వించడానికి వీలయేటట్లు తయారవుచున్నారు. అందరియొక్క ఆకర్షణను పొందుతున్నారని చెప్పతున్నాను. మన సైన్సు గాడ్యుయేట్సు బైట ఎంతో మంచి పేరు తెచ్చుకున్నారని చెప్పతున్నాను. ఈ బిల్లును గురించి శాసనసభ్యులు చెప్పినది దీవనలుగా తీసుకుంటున్నాను.

తరువాత కృషికలోక్ వారైన N. V. రామారావుగారు విశ్వవిద్యాలయాన్ని సమర్థించవలసిన రీతిగా మాట్లాడుతారని అనుకొన్నాను. ఎందుకంటే వారు చాలా హెచ్చుగా చదువుకొన్నవారు, విశేష సంస్కృతి ఉన్నవారని అనుకొంటున్నాను, ఇప్పటికి కూడాను ఆ స్థాయికి నేను వెళ్ళలేనని నాకు తెలుసును. వీరు వీరకృషికలో లేక కృషిక్ వీరులో అనే సమస్య కూడ వచ్చింది. నాకు తెలుసును. వీరు ఆంధ్రకేసరి పంతులుగారిని కూడ విమర్శించారు. కావచ్చు, అసలు ఈ విశ్వవిద్యాలయ సమస్యను వదలిపెట్టేవాళ్ళము. కాని ఈనాడు ఇక్కడ పంతులుగారు ఉండడం వల్లనే దీనిని తీసుకొనిరాగలిగాము. ఈ ఆంధ్రకేసరివల్లనే ఈ ప్రభుత్వము ఏర్పడింది, ఇంతవరకు ప్రభుత్వము నిలబడగలిగింది. ఈ నాడు ఈ విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పగలిగే స్థితికి వచ్చాము వారివల్లనే దీనికి నేడు పునాదులు వేయడానికి ధైర్యమువచ్చింది. వారు దీనిని 1946 లోనే తలపెట్టారు. దేశములో ఎటువంటి పరిస్థితులున్నప్పటికి దేశము ఎలా ఉన్నప్పటికి, ఈ కార్యము నెరవేర్చవలెనని గట్టిగా పూనుకొన్నారు. కాని మేము మాత్రము పసితనమువల్లనో, లేక అనుభవం లేకపోవడం వల్లనో, కొంత అధైర్యపడి జంకినాము. వారు ధైర్యము ఇచ్చినమీదటే ఈ బిల్లును తయారుచేయుటానికి పూనుకొని ఆ విధంగా మంత్రివర్గము ఏకగ్రీవంగా దీనికి అంగీకరించింది. దేశముయొక్క క్షేమాన్ని, లాభాన్ని చూచే ఈ విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పడానికి ప్రయత్నిస్తున్నాము. అంతేగాని, కృషిక్ వీరులు అనుకొన్నట్లుగా ప్రజలను దేశాన్ని చీల్చివేసే దృక్పథాన్ని అవలంభించలేదు. దీనివల్ల అటువంటిదేమి జరుగదు. మొత్తంమీద విశ్వవిద్యాలయమొకటి ప్రత్యేకంగా ఉండాలనేవాళ్ళు హెచ్చుమంది ఉన్నారు. K. వెంకయ్య

గారికి ఈ విషయంలో credit ఇవ్వాలని అనుకొంటాను. ఎందుకంటే వారు దీన్ని ఒకవిధంగా అంగీకరించినట్లే చెప్పారు. అయితే 2 సంవత్సరాలవరకు ఈ Colleges మద్రాసు యూనివర్శిటీవారి చేతులలో ఎందుకుండాలన్నారు. వారు ఈ విషయములో పొరబాటుపడుతున్నారు. అక్కడ ఏమనిచెప్పబడిందంటే "It may, however, be noted that for two years to come the examinations of students in affiliated colleges in this area must continue to be conducted by the Madras University" అని ఉన్నది. అసలు విషయ మేమిటంటే, ఒక విశ్వవిద్యాలయంనుంచి ఇంకొక విశ్వవిద్యాలయానికి మార్చేటప్పుడు ఆ transitory period అనగా రెండు సంవత్సరాలకాలము ఇవ్వకపోయినట్లైతే, ఆ రెండు సంవత్సరాలు పరీక్షలు జరుపుటకు చాలా కష్టముగా యుంటుంది. కొత్త విశ్వవిద్యాలయము వెంటనే పరీక్షలు జరపడానికి సాధ్యంకాదు. ఎందుకంటె కొత్త విశ్వవిద్యాలయము యొక్క పుస్తకాలు వేరుగాఉంటాయి. Board of Examiners వేరుగా ఉంటారు. దీని standard, aims వేరే ఉంటాయి. అటువంటప్పుడు ఇన్ని కొత్తమార్పులతో వెంటనే పరీక్షలు పెట్టడానికి సాధ్యంకాదు, పాత యూనివర్సిటీలే ఏటేటా 2, 3 సంవత్సరముల వరకు జరుపవలసి యుంటుంది. ఆంధ్రవిశ్వవిద్యాలయము మద్రాసు నుంచి విడిపోయి నప్పుడున్నూ, ఒరిస్సా విశ్వవిద్యాలయము ఏర్పడినప్పుడున్నూ ఈవిధంగా చేశారు. అందుకనే ఈ విధంగా దీని విషయములోను సూచించారు. అంతకంటే మరేమీ లేదు. ఇది ఒక transitory provision అనే నేను మనవి చేస్తున్నాను. తరువాత M. V. సుబ్బారెడ్డిగారు ఈ విషయాన్ని గ్రహించారు. వారు ఈ Affiliating విశ్వవిద్యాలయాన్ని రెండుసంవత్సరాల తరువాత పెట్టండి అని అన్నారు. రామయ్యగారు మాట్లాడుతూ, Oil technological Institute గురించి కొంత విమర్శించారు. బహుశా నేను నిన్న చెప్పినదానిని గురించి పొరబాటు అభిప్రాయము కలిగించానేమోనని అనుకొంటున్నాను. ఈ Institute లో తొమ్మిదిమంది విద్యార్థులే ఉన్నారని చెప్పాను. ఎందుకు ఇంత తక్కువ

మందికి అంత ఖర్చు చేయడమనే విషయంలో వారు పొరబాటు అర్థం చేసుకొని యుంటారు. అసలు T. లక్ష్మీనారాయణరెడ్డి గారు చెప్పడంలో అనంతపురములో ఆ Oil Technological Institute లో 12 మందికే provision ఉంటుందని అన్నారు. ఈ Technological Institute లోను Medical Institute లోను కొద్ది సీట్లే కాని వీటివల్ల ఖర్చు ఎక్కువ. ఇవి ఆవిధంగా జరుగవలసి యున్నది. కనుక ఆ Institute లో 9 మందే ఉన్నా, సంఖ్య తక్కువ ఉన్నదని అభిప్రాయ పడకూడదు.

తరువాత Pro-Chancellor, Education Minister ఉండాలని ఇందులో ఉన్నదంటే ఇది నా కోరకేమి చేసుకొనింది కాదు. నేను శాశ్వతముగా ఉండబోయేది ఏమిలేదు. దీనివల్ల నాకు వచ్చేదేమీలేదు. ఇప్పుడు మద్రాసు యూనివర్సిటీలోను, ఆంధ్ర యూనివర్సిటీ లోను Chancellor, Pro-chancellor ను nominate చేస్తున్నారు. Nominate చేస్తున్నాడంటే Education Minister ను consult చేసే చేస్తున్నారు. Education Minister కాకపోయినా ఆయన చెప్పినవాడు ఉంటాడు. అంతకంటే మరేమి లేదు. అందులో ఉండాలని నాకేమి ఆశలేదు. అందువల్ల ఆ విషయము మీరేమి చేసినా చేయవచ్చు. నాకేమి బాధలేదు. తరువాత మిత్రులు నాగిరెడ్డిగారు చాలా జాగ్రత్తగా study చేసి చెప్పారు. వారు Benares University లో మొదటి రోజులలో చదువుకొన్నవారు. Residential University లో పొందిన వారి స్వానుభవముతో చెప్పారు, అందువల్ల Residential University మంచిదని అన్నారు. వారి స్వానుభవము ఆ విధంగా ఉన్నది. నా స్వానుభవము ఈ విధంగా ఉన్నది. నా స్వానుభవం ప్రకారం Affiliating University యే మంచిదని చెప్పుతున్నాను. Select Committee లో ఏది మంచిది, ఏది కాదు అనే విషయాలన్నీ సమగ్రంగా చర్చించవచ్చును. C. R. రెడ్డి కాలములో వారు ఈ రాయలసీమ కాలేజీలను ఇందులో చేర్చడానికి చాలా ప్రయత్నించారు. ఈ విషయములో ఒక రిపోర్టు కూడ ఇచ్చారు. తరువాత క్రిష్ణా

గారు, Director of Public Instruction గా ఉండిన D. S. రెడ్డిగారు వీరంతా ప్రయత్నించారు. కాని C. R. రెడ్డిగారి report ఎట్లా ఉన్నప్పటికి, ఈ కాలేజీలు ఇందులో కలియు డానికి అంగీకరించ లేదు. తరువాత కొత్త యూనివర్సిటీ అయితే post graduate courses మొదలైనవన్నీ recognition అయ్యేందుకు చాలా కాలము పడుతుంది. అందువల్ల అవన్నీ దీనికి affiliate చేస్తేనే మంచిదని అన్నారు కాని, కొత్త యూనివర్సిటీకి ఈ విషయములో కొంతకాలము పట్టినప్పటికి దానిని ప్రత్యేకంగా recognition ఇచ్చి ఎక్కువ బలాన్ని చేకూర్చిన వాళ్ళవుతాము. కనుకనే ఇది Affiliating University గా ఉండాలా, లేక కేవలం Residential University గా వుండాలా, అన్న విషయాన్ని ఈ కమిటీవారు జాగ్రత్తగా చర్చించి ఈ విధంగా conclusion కు వచ్చారు. తరువాత ఈ విధంగా దీనిని Affiliating University గా చేయడం వల్ల ప్రాంతీయ భేదాలను కల్పిస్తున్నారని విమర్శించారు కాని, ఒక్కొక్క విశ్వ విద్యాలయములో కొన్ని కొన్ని subjects కు ప్రాధాన్యత యుంటుంది. ఇక్కడ Intermediate లో Science కు ఎక్కువ ప్రాధాన్యత వున్నది. Languages కు ప్రాధాన్యత తక్కువ. కాని తిరుపతి విశ్వవిద్యాలయములో languages కు తరువాతనే ఈ Arts కు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నాము. కనుక కొన్ని కొన్ని subjects లో వాళ్ళ standard వేరుగా ఉంటుంది. ఇక్కడి standard వేరుగా ఉంటుంది కనుక ఆయా subjects ఆయా Standards affect కాకుండా దానివల్ల ఎవరికి ఇబ్బంది లేకుండా ఉండాలంటే Affiliating University ఉండడం మంచిది. కనుక ఈ కొత్త University ప్రత్యేకంగా Residential and Affiliating University గా ఉంటే అన్ని విధాల బాగుంటుందనే confidence తో ఈవిధంగా చేశాము.

ఇక మెంబర్‌షిప్ విషయములో రాయలసీమ side కు కొద్దిగా మనం membership ఇస్తున్నాం, హెచ్చుగా Assembly Members కు ఇస్తున్నాం. హిందూ దేశంలో ఉన్న విశ్వవిద్యాలయాలన్నీ కూడా ఒకే పద్ధతిలో ఉంటు

న్నాయి. కాబట్టి అలాచేశాం, స్టూడెంట్సునుకూడా Senate Members గా వేయాలని చెప్పారు. స్టూడెంట్సుగా ఉండి అటువంటివాటిల్లో పాల్గొనడం మంచిదికాదు అందువల members గా వాళ్ళను వేయలేదు. Graduates తరఫున కూడా ఒకరిద్దరు మాట్లాడారు. ఇంతవరకుచూస్తే మద్రాసు విశ్వవిద్యాలయంలో గాని, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో గాని బళ్లారి రాఘవాచారివంటి వారెవరో ఎన్నిక అయినారేగాని ఇంకెవరూ కాలేదు, ఎందుచేతంటే వారు మద్రాసు విశ్వవిద్యాలయంతో కలిసిన తరవాత వాళ్ళు తక్కువమంది ఉన్నారు. అందువల్ల Graduates తరఫున ఎలక్టు అవడం కష్టంఅవుతుంది. ఈ రెండు విశ్వవిద్యాలయాలు కూడ ఏ విధంగా దేశాన్ని అభివృద్ధి పరచడానికి తోడ్పడతాయి అనే విషయం మీరు ఆలోచించవచ్చు. కేవలం రెండు విశ్వవిద్యాలయాలు రెండు కాళ్ళుగాను, రెండు చెవులుగాను, ఆంధ్ర దేశానికిఉండి, మన యొక్క విజ్ఞానాన్ని వికసింప చేస్తాయని రెండు విశ్వవిద్యాలయాలు పెట్టాలని తలపెట్టాము. రెండు విశ్వవిద్యాలయాలుండాలనే విషయాన్ని చాలామంది చెప్పారు. ఆ విషయం మీద Select Committee లో ఆలోచించవచ్చు. ప్రభుత్వం వారు ఏదో రాజకీయ పద్ధతిలో నడిపించుకుంటున్నారని అనుకోవద్దు. ఆంధ్రదేశానికి సేవచేయాలని, ఆంధ్రదేశాన్ని అభివృద్ధి చేయాలని ఆశతో చేస్తున్నామని స్పీకరుగారి ద్వారా ఈ విషయాన్ని మీకు మనవిచేస్తున్నాను.

Mr. SPEAKER :— I am putting the amendment of Sri Vavilala Gopalakrishnaiah to the vote of the House.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— Amendment ను vote కు పెట్టేముందు రెండు మాటలు చెప్పాలనుకుంటున్నాను. ఇప్పుడున్న బిల్లును Select Committee కి పంపిస్తే అక్కడ అన్ని విషయాలు చర్చించడానికి అవకాశం ఉంటుంది. దేశంలో ఉండే విద్యావేత్తలందరి యొక్క అభిప్రాయాలను కూడా కనుక్కుంటే బాగుంటుంది. అలాచేస్తే నా amendment విరమించు కుంటాను.

Sri T. NAGI REDDI :— Select Committee కి ఆ అవకాశం ఉంది. అలా పంపించుకొని విచారించడానికి కూడా అవకాశం ఉంది.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :— రూల్సులో ఉంటే, దాని విషయం ఆలోచన చేస్తాము.

The amendment was not pressed.

Mr. SPEAKER :— The Question is

That the Sri Venkateswara University Bill, 1954 be referred to a Select Committee.

The motion was carried.

Mr. SPEAKER :— These are the names of the members of the Select Committee :—

Sri S. B. P. Pattabhirama Rao
,, T. Viswanatham
,, P. Ranga Reddi
,, K. Varadachari
,, R. Lakshminarasimham Dora
,, M. Subba Reddi
,, T. Nagi Reddi
,, Pillalamarri Venkateswarlu
,, M. Veerabhadram
,, M. V. Subba Reddi
,, P. Pundarikakshacharyulu.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao, the Minister concerned, will be the Chairman of the Committee.

The House stands adjourned till 10 A. M. on Monday, the 17th May 1954.

The House then adjourned

## APPENDIX I

**Vide answer to Starred Question No. 492 put by SRI P. VENKATASUBBIAH, at the meeting of the Legislative Assembly held on 15—5—54.**

### ANSWER TO CLAUSE (A)

| Name of the District. | Name of the Municipality. | SWEEPERS Men and Pay Rs | SWEEPERS Women and Pay Rs | SWEEPERS D A. Rs | SWEEPERS H R A Rs | SCAVENGERS Men and Pay Rs | SCAVENGERS Women and Pay Rs. | SCAVENGERS D A Rs | SCAVENGERS H R A Rs |
|---|---|---|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
| Anantapur | Anantapur | 15 | 15 | 18 | 3 | 15 | 15 | 18 | 3 |
| | Tadapatri | 15 | 15 | 18 | 3 | 15 | 15 | 18 | 3 |
| | Hindupur | 15 | 15 | 18 | – | 15 | 15 | 18 | – |
| Cuddapah | Cuddapah | 15 | 13/2 | 18 | 3 | 15 | 13/2 | 18 | 3 |
| | Prodatur | 14/1 | 14/1 | 18 | 3 | 14/1 | 14/1 | 18 | 3 |
| Chittoor | Chittoor | 15 | 15 | 18 | 3 | 15 | 15 | 18 | 3 |
| | Tirupathi | 15 | 15 | 18 | 3 | 15 | 15 | 18 | 3 |
| Guntur | Guntur | 15 | 15 | 18 | 3 | 15 | 15 | 18 | 3 |
| | Chirala | 12 | 12 | 18 | 3 | 13/8 | 13/8 | 18 | 3 |
| | Tenali I | 12 | 12 | 18 | 3 | I — | — | — | – |
| | II | 12/8 | 12/8 | 18 | 3 | II — | — | — | – |
| | III | 13/2 | 13/2 | 18 | 3 | III — | — | — | – |
| | IV | 13/12 | 13/12 | 18 | 3 | IV — | — | — | – |
| | V | 14/6 | 14/6 | 18 | 3 | V — | — | — | – |
| | Bapatla | 12/8 | 12/8 | 18 | 3 | 15 | 15 | 18 | 3 |
| | Narasaraopet | 15 | 15 | 18 | 3 | 15 | 15 | 18 | 3 |
| | Ongole | 13/8 | 13/8 | 18 | 3 | 13/8 | 13/8 | 18 | 3 |

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| East Godavari | Kakınada | | 15 | 12/8 | W 15 M 18 | 3 | | 15 | 12/8 | W 15 M 18 | 3 |
| | Peddapuram | I | 12 | 12 | 18 | 3 | I | — | — | — | - |
| | | II | 15 | 15 | 18 | 3 | II | — | — | — | - |
| | | III | 13 | 13 | 18 | 3 | III | — | — | — | - |
| | | IV | 14 | 14 | 18 | 3 | IV | — | — | — | - |
| | Amalapurm | | 13 | 13 | 18 | - | | 13 | 13 | 18 | - |
| West Godavari | Bhımavaram | | 15 | 15 | 18 | 3 | | 15 | 15 | 18 | 3 |
| | Eluru | I | 11/4 | 11/4 | 18 | 3 | I | 11/4 | 11/4 | 18 | 3 |
| | | II | 12/8 | 12/8 | 18 | 3 | II | 12/8 | 12/8 | 18 | 3 |
| | | III | 13/12 | 13/12 | 18 | 3 | III | 13/12 | 13/12 | 18 | 3 |
| | | IV | 15 | — | 18 | 3 | IV | 15 | — | 18 | 3 |
| Krıshna | Gudivada | | 14/6 | 11/14 | 18 | 3 | | 14/6 | 11/14 | 18 | 3 |
| | Masulıpatnam | I | 15 | 15 | 18 | 3 | I | 15 | 15 | 18 | 3 |
| | | II | 13/12 | 13/12 | 18 | 3 | II | 13/12 | 13/12 | 18 | 3 |
| | | III | 12/8 | 12/8 | 18 | 3 | III | 12/8 | 12/8 | 18 | 3 |
| | Vıjayawada | From | 12 | 12 | 18 | 3 | From | 12 | 12 | 18 | 3 |
| | | To | 15 | 15 | — | - | To | 15 | 15 | — | - |
| Nellore | Nellore | | 12/8 | 12/8 | 18 | 3 | | 12/8 | 12/8 | 18 | 3 |
| | Gudur | | 15 | 15 | 18 | 3 | | 15 | 15 | 18 | 3 |
| Kurnool | Kurnool | | 15 | 15 | 18 | 3 | | 15 | 15 | 18 | 3 |
| | Nandyal | | 15 | 15 | 18 | - | | 15 | 15 | 18 | - |
| | Adonı | | 15 | 15 | 18 | 3 | | 15 | 15 | 18 | 3 |
| Visakhapatnam | Vısakhapatnam | | 17 | 17 | 18 | - | | 17 | 17 | 18 | - |
| | Anakapallı | | 15 | 15 | 18 | - | | 15 | 15 | 18 | - |
| | Vıjayanagaram | | 15 | 15 | 18 | - | | 15 | 15 | 18 | 3 |
| Srıkakulam | Srıkakulam | | 13/8 | 13/8 | 18 | 3 | | 13/8 | 13/8 | 18 | 3 |
| | Saluru | | 12 | 12 | 18 | - | | 12 | 12 | 18 | - |

## *APPENDIX II*

(Vide Answer to Starred Question No 510 put by Sri G Yellamanda Reddy, at the meeting of the Assembly held on 15-5-'54.)

Statement showing the particulars of gruel centres run with the aid of Russian gift grain and the quantity of Russian wheat and rice distributed in the shape of grain in the famine stricken taluks of Nellore district:

*Clause (a) of the question—*

### LIST OF VILLAGES WHERE GRUEL CENTERS WERE RUN IN NELLORE DISTRICT IN FASLI 1362.

PODILI TALUK

1 Katragunta
2 Siddavaram
3 Konakanamittla
4 Thuvvapad
5 Anndalapalli
6 Nagampalli
7 Gotlagattu
8 Chinamanagudur
9 Podili
10 Chinarikatla
11 Munagapad
12 Badugulur
13 Unnaguravayapalem
14 Pedarikatla
15 Marripudi
16 Maljuvvalapad
17 Tarlupad

UDAYAGIRI TALUK

18 Udayagiri
19 Kurrapalli
20 Pullayapalli
21 Ganavaram
22 Singareddipalli
23 Seetharampuram I
24 Seetharampuram II
25 Maramreddipalli
26 Bodasiddayapalli
27 Chinanagampalli
28 Chowdapalli
29 Gandiayapalem
30 Thotalacheruvupalli
31 Nandipad
32 Nandavaram
33 Yepilagunta
34 Duttalur
35 Vinjamur
36 Tamidipad
37 Marripad
38 Gangulavaricheruvupalli
39 Thuravanimaidupet

DARSI TALUK

40 Darsi
41 Pedaulagallu
42 Rajampalli
43 Samanthapudi
44 Edara
45 Marella
46 Umamaheswarapuram

DARSI TALUK (cont)

47 Donakonda
48 Kocherla Kota
49 Polepalli
50 Ramanalavaripalem
51 Mendlamur
52 Chandalur
53 Gangdevupalli
54 Pothakamur
55 Boddikurapad
56 Lakhavaram
57 Kalaguvvalapad
58 Tadivaripalli
59 Kethagudipi
60 Tarlupadu
61 Kuchedu
62 Potlapad
63 West Naidupalem
64 Dekavakonda
65 Thummedalapudi (Midday gruel centre)
66 Chalivendra (Midday gruel centre)
67 Ramachendrapuram (Midday gruel centre)
68 Tallur (Midday gruel centre)
69 Vittalapuram (Midday gruel centre)
70 Umamaheswarapuram (Midday gruel centre)
71 Avulamanda (Midday gruel centre)
72 Chintalapudi (Midday gruel centre)

KANIGIRI TALUK

73 Vedullacheruvu
74 Pillipalli
75 Gudipatipalli
76 Guravagipet
77 Challagirigala
78 Peodarajupalem
79 Pedda Alavalapad
80 Kanigiri
81 Nagireddipalli
82 China Alavalapad
83 Raviguntapalli
84 Pedacherlopalli
81 Nandanavanam
86 Pamur
87 Thimmareddipalli
88 Doddichinthala
89 Pedagogulapalli
90 Darsiguntapeta
91 Bommareddipalli
92 Pednapuram
93 Papireddipalli
94 Ummanapalli
95 Mogalur
96 Chandrasekharapuram
97 Chakirala
98 Pulikuntla
99 Veggarupalli
100 Pedarlapad
101 Hanumanthunipad
102 Vamulapad
103 Tallur
104 Marella
105 Panduvanagulavaram
106 Sankarapuram (Midday gruel center)

*Clauses (b) and (c) of the question—*

## Village-war Particulars of Quantity of Russian Wheat and Rice Distributed

| Serial number, name of the village and taluk | Quantity issued Wheat IMP MDS | Quantity issued Rice IMP MDS | Serial number, name of the village and taluk | Quantity issued Wheat IMP MDS | Quantity issued Rice IMP MDS |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 1 | 2 | 3 |
| PODILI TALUK | | | UDAYAGIRI TALUK | | |
| 1 Katragunta | 122 1/2 | 59 | 27 Udayagiri | 60 | 17 |
| 2 Siddavaram | 122 1/2 | 65 | 28 Kurrapalli | 30 | 9 |
| 3 Konakanamitla | 140 | 72 | 29 Pullayapalli | 37 1/2 | 8 |
| 4 Thuvvapad | 117 1/2 | 63 | 30 Gangavaram | 37 1/2 | 12 |
| 5 Amudalapalli | 100 | 58 | 31 Singaireddipalli | 27 1/2 | 8 |
| 6 Nagampalli | 122 1/2 | 64 | 32 Seetharamapuram II | 30 | 10 |
| 7 Gotlagattu | 122 1/2 | 62 | 33 Seetharamapurdu II | 38 3/4 | 10 |
| 8 Chinnamanagudam | 145 | 72 | 34 Maramreddipalli | 30 | 8 |
| 9 Podili | 196 7/8 | 115 | 35 Bodegiddayapalli | 38 3/4 | 10 |
| 10 Chinarikatla | 128 3/4 | 68 | 36 Chinangamapalli | 35 | 10 |
| 11 Munagapad | 125 | 61 | 37 Chowdepalli | 50 | 13 |
| 12 Baduguluru | 92 1/2 | 52 | 38 Gandipalem | 35 | 9 |
| 13 Egalapad | 92 1/2 | 50 | 39 Thotalacheruvupalli | 66 1/4 | 18 |
| 14 Unnaguruvayapalem | 82 1/2 | 53 | 40 Nandipad | 20 | 6 |
| 15 Padarikatla | 142 1/2 | 76 | 41 Nandavaram | 22 1/2 | 6 |
| 16 Marripudi | 127 1/2 | 64 | 42 Yepalagunta | 27 1/2 | 6 |
| 17 Uppalapad | 65 | 50 | 43 Duthalore | 30 | 9 |
| 18 Kaljuvvalapad | 65 | 48 | 44 Vinjamur | 23 3/4 | 6 |
| 19 Kambhalapad | 51 1/4 | 44 | 45 Tamidapad | 22 1/2 | 6 |
| 20 Tarlupad | 70 | 62 | 46 Manipad | 27 1/2 | 8 |
| 21 Kathagudipi | 65 | 54 | 47 Gangalavaricheruvu-palli | 26 1/4 | 6 |
| 22 Tadivaripalli | 60 | 44 | | | |
| 23 Obulakkapalli | 2 1/2 | | 48 Thimmanaidupet | 42 1/2 | 12 |
| 24 Maddalavaripalem | 2 1/2 | | 9 Bodavada | 3 3/4 | 8 |
| 25 Pothavaram | 105 | | | | |
| 26 Kellampalli | | | | | |
| Total | 2,471 7/8 | 1317 | Total | 756 1/4 | 118 |

# VILLAGE-WAR PARTICULARS OF QUANTITY OF RUSSIAN WHEAT AND RICE DISTRIBUTED

| Serial number, name of the village and taluk | Quantity issued Wheat IMP MDS | Quantity issued Rice IMP MDS |
|---|---|---|
| 1 | 2 | 3 |
| DARSI TALUK | | |
| 50 Darsi ... | 83 3/4 | 66 |
| 51 Pedaulagallu ... | 45 | 25 |
| 52 Rajampalli ... | 67 1/2 | 38 |
| 53 Samanthapudi ... | 41 1/4 | 24 |
| 54 Edara ... | 67 1/2 | 38 |
| 55 Marella ... | 38 3/4 | 23 |
| 56 Umamaheswara-puram ... | 77 1/2 | 40 |
| 57 Donakonda .. | 57 1/2 | 16 |
| 58 Kocherlakota ... | 122 1/2 | 58 |
| 59 Polepalli ... | 35 | 9 |
| 60 Ramaulavaripalem .. | 45 | 24 |
| 61 Mundalur ... | 75 | 25 |
| 62 Chandalur ... | 75 | 50 |
| 63 Gangadevipalli ... | 42 1/2 | 10 |
| 64 Pothakamur ... | 70 | 38 |
| 65 Boddikurapad ... | 02 1/2 | 30 |
| 66 Lakkavaram ... | 65 | 30 |
| 67 Kuluzuvvalapad ... | 45 | 12 |
| 68 Tadivaripalli ... | 37 1/2 | 8 |
| 69 Kethagudipi . | 37 1/2 | 10 |
| 70 Tailupad ... | 62 1/2 | 14 |
| 71 Kurichedu ... | 77 1/2 | 40 |
| 72 Potlapadu ... | 82 1/2 | 42 |
| 73 West Naidupalem ... | 67 1/2 | 43 |
| 74 Dekanakondur ... | 70 | 35 |
| 75 Thummadalapad ... | 10 | 3 |
| 76 Chalivendra ... | 11 1/4 | 4 |
| 77 Ramachandrapuram .. | 10 | 4 |
| 78 Tallur ... | 67 1/2 | 26 |
| 79 Vittalapuram ... | 5 | . |
| 80 Avvulamanda ... | 25 | 14 |
| 81 Chinthalapudi | 2 1/2 | .. |
| 82 Kallur .. | 17 1/2 | 12 |
| 83 Mustalagangavaram... | 2 1/2 | 2 |
| 84 West Gangavarm and Alavalapad .. | 327 1/2 | 12 |
| 85 Gangadanakonda .. | 20 | 16 |
| 86 Devaram . | 25 | 18 |
| 87 Pothavaram . | 25 | 22 |
| 88 Palipadu | 12 1/2 | 10 |
| 89 Venkatachalampalli | 30 | 12 |
| 90 Venkatapuram . | 10 | 2 |
| 91 Lankojinapalli .. | 10 | 2 |
| 92 Bandiveligandla .. | 57 1/2 | 12 |
| 93 Ganeswarapuram | 10 | 2 |
| 94 Mangeripud . | 37 1/2 | 28 |
| 95 Gudpadu .. | 37 1/2 | 38 |
| 96 Badapuram ... | 37 1/2 | 30 |
| 97 Chandavaram ... | 25 | 18 |
| 98 Battepadu ... | 32 1/2 | 24 |
| 99 Rudrasamudram .. | 25 | 16 |
| 100 Ramapuram .. | 25 | 20 |
| 101 Lakshmipuram ... | 17 1/2 | 14 |
| 102 Vaddipudi . | 10 | 4 |
| 103 East Veerayapalem | 30 | 10 |
| 104 Vemula ... | 32 1/2 | 14 |
| 105 Pasupugallu .. | 27 1/2 | ... |
| 106 Naidupalem Kandriga | 7 1/2 | 3 |
| 107 Jammalamadaka ... | 32 1/2 | 2 |
| 108 Polavaram ... | 22 1/2 | 10 |
| 109 Madhavaram ... | 32 1/2 | 14 |
| Total .. | 2,367 1/2 | 1,146 |

# VILLAGE-WAR PARTICULARS OF QUANTITY OF RUSSIAN WHEAT AND RICE DISTRIBUTED

| Serial nnmber, name of the village and taluk | Quantity issued Wheat IMP MDS | Quantity issued Riee IMP MDS |
|---|---|---|
| KANIGIRI TALUK | | |
| 110 Vedullacheruvu | 633 | 48 |
| 111 Pullipalli | 110 | 20 |
| 112 Gudipatipalli | 117 1/2 | 94 |
| 113 Guravagipet ... | 67 1/2 | 48 |
| 114 Callgirigale .. | 85 | 66 |
| 115 Pedarajupalem .. | 70 | 52 |
| 116 Pedalavalapadi | 58 3/4 | 50 |
| 117 Kanigiri .. | 45 | 35 |
| 118 Nagireddipalli ... | 10 | 4 |
| 119 Chinaalavalapad ... | 35 | 43 |
| 120 Raviguntapalli ... | 92 1/2 | 68 |
| 121 Peddacherlopalli .. | 103 3/4 | 62 |
| 122 Nandanavanam ... | 82 1/2 | 64 |
| 123 Pamur ... | 97 1/2 | 40 |
| 124 Thimmareddipalli... | 67 1/2 | 62 |
| 125 Doddichinthala ... | 52 1/2 | 14 |
| 126 Peddagogulapalli .. | 27 1/2 | 8 |
| 127 Darsiguntapeta ... | 105 | 26 |
| 128 Bommireddipalli ... | 66 1/4 | 50 |
| 129 Padmapuram ... | 27 1/2 | 40 |
| 130 Papireddipalli ... | 61 3/4 | 52 |
| 131 Ummanapalli ... | 91 1/4 | 56 |
| 132 Mogallur ... | 28 3/4 | 44 |
| 133 Chandrasekharapuram | 37 1/2 | 10 |
| 134 Chakirala ... | 27 1/2 | 6 |
| 135 Pulikuntla ... | 61 1/4 | 50 |
| | | 3 |
| 136 Voggampalli | 42 1/2 | 12 |
| 137 Peda Irlapil . | 87 1/2 | 66 |
| 138 Hanumanthunipadi | 57 1/2 | 48 |
| 139 Vemulapad . | 61 1/4 | 48 |
| 140 Tallur .. | 65 | 50 |
| 141 Marella | 63 1/4 | 50 |
| 142 Panduvanagulavaram | 202 1/2 | 150 |
| 143 Sankavaram | 50 | 20 |
| 144 Pedagollapalli ... | 50 | 20 |
| 145 Hazipuram .. | 50 | 20 |
| 146 Musunool ... | 57 1/2 | 20 |
| 147 Chinthalapalem .. | 50 | 20 |
| 148 Veligondla ... | 55 | 24 |
| 149 Katagilla ... | 50 | 20 |
| 150 Ramayanapalli ... | 20 | 12 |
| 151 Guravayipalli ... | 10 | 4 |
| 152 Gudipallipadu ... | 20 | 5 |
| 153 Sankarapuram ... | 20 | 4 |
| Total ... | 2,705 | 1,706 |
| Podili taluk ... | 2,471 7/8 | 1,317 |
| Udayagiri taluk... | 756 1/4 | 118 |
| Darsi taluk ... | 2,367 1/2 | 1,146 |
| Kanigiri taluk ... | 2,705 | 1,706 |
| Grand total ... | 8,300 5/8 | 4,287 |

## *APPENDIX - III*

## STATEMENT PLACED ON THE TABLE OF THE HOUSE

(Vide answer to clause (a) of starred question No. 511 by Sri G Rama Rao at the meeting of the Assembly held on 15—5—54)

### *Taluk-war details of cholera epidemic in Krishna District during October and November* 1954.

| Name of Taluk | October, 1953 | | | November, 1953 | | |
|---|---|---|---|---|---|---|
| | No of villages infected | Attacks | Deaths | No of villages infected | Attacks | Deaths |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
| Bandar | 4 | 16 | 9 | 2 | 11 | 9 |
| Vijayawada | 6 | 22 | 15 | 3 | 5 | 4 |
| Divi | 9 | 22 | 16 | 2 | 4 | 5 |
| Gudivada | 3 | 3 | 3 | — | — | — |
| Gannavaram | — | — | — | — | — | — |
| Kaikalur | 4 | 6 | 5 | 4 | 13 | 9 |
| Nandigam | 8 | 45 | 25 | — | — | — |
| Nuzvid | 1 | 2 | 2 | 1 | 1 | 1 |
| Tiruvur | — | — | — | — | — | — |
| Total.... | 35 | 116 | 75 | 12 | 34 | 28 |